# కుందమాల

9107

కావ్యతీర్థ
గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

**పి. ఆర్. అండ్ సన్సు,**
పబ్లిషర్సు : **బెజవాడ**

# పరిచయము

కలాకుశలులారా !

దృశ్యప్రబంధ నిర్మాణమునుగూర్చి అవినీతులగు రాజపుత్రుల ననున యింప నిది యుపయోగించునని అభియుక్తులు తమ యభిప్రాయముల గ్రంథముఖమున వెల్లడించియున్నారు. కవికులగురుఁడగు కాళిదాసుఁడును, పశుహింసారహితమగుట శాంతమగు చాక్షుషక్రతు విది యని వేల్పులు పంతసింతురని మునుల యభిప్రాయమని నాట్యమును తన మాలవికాగ్నిమిత్రీయమున వర్ణించియున్నాఁడు. శాబ్దప్రామాణ్యప్రాధాన్య వాదమునకు లోఁబడు మాదృశుల కిది యిష్టమైనను కేవల ప్రత్యక్షప్రమాణ ప్రమాతలగు నాధునికులలో కొందఱకు రుచింపకపోవచ్చును. కాని మొదటివిషయ మందఱకుఁ బ్రమాణీకరింపవలసినదే యని తలఁచుచున్నాను. విజ్ఞుఁడగు నటుఁడు నాయకాదిభూమిక నవధరించి సత్యధర్మాదిప్రధానకథాధోరణుల నభినయింప జూచు నప్పు డెప్పగిది వాని బాగుండెయేనియు నరకవాసుల దురవస్థ గనుగొన్న రావణుమనస్సువోలె మెత్తఁదన మొనయకుండలేదు. కావుననే దీని నొక కళ యని లక్షణము వ్రాసి చాలకాలము నుండి లోకమునఁ బ్రచారములో నునిచిరి. నాయకుఁడు ప్రసిద్ధుఁడుగా నుండవలెనని, లోకోత్తరగుణోత్తరుఁడు కావలెనని, సుఖాంతముగాగాని, విజయాంతముగాఁగాని రూపకము ముగింపనగునని, ప్రతిలక్షణగ్రంథకర్తయు వ్రాయువిషయ మద్దానికి సాక్ష్య మిచ్చుచునేయున్నది. ప్రసిద్ధమగు నితివృత్తమునకైనను సత్యధర్మములకు భంగకరమగు ననుచితమున్న నది మార్చియైన కవి యౌచితి నెఱపవలెనని తల్లక్షణము లుద్ఘోషించుచున్నవి. ఇప్పటి కొన్ని సినిమాలమాదిరి నిడయు ననర్థదాయక మగునేమో యనియే పూర్వు లంత కట్టుబాట్లు పెట్టిరని తలపవచ్చును. విసువు పుట్టునేమో, యట్టి రాజకుమారు లెక్కువసేపు ముడ్డి కుదిరి కూర్చుండరుకదా యని నాటకమంతయు జాముసేపులో ముగియవలె ననిరి. కాఁబట్టియే సూచ్యార్థము దృశ్యార్థము అని రెండు భాగములు సేసి విష్కంభము, ప్రవేశము, చూలిక, అంకాస్యము, అంకావతరణము అను నైదింటిచే సూచ్యమును సూచించి దృశ్యమునుమాత్ర మంకములయందుఁ బ్రదర్శింపు మనిరి. మునుమున్న ప్రస్తావన, స్థాపన యను పేళ్ళతో కవి కావ్యకథాప్రశంసఁ జేసి

ప్రేక్షకుల డెందముల నెందుఁ బోకుండ నరికట్టదగు పీఠిక నమర్చిరి. అందు ప్రధానకథాంశములో కొంత సంబంధము కల యితరపాత్రలు తమసల్లాపములలో జరిగినముఖ్యకథను వర్ణించి రాఁబోవు రంగమున, ప్రవేశింపఁబోవు పాత్రలను, తద్విషయవిభాగమును సూచించి పోవు రంగమునకు బ్రవేశక మని పేరు. స్వగతము లోలోపలియాలోచనము; సభ్యులకుఁ దెలియుటకు మాత్ర ముచ్చరింపఁబడును. జనాంతికము—చేయి యడ్డముపెట్టి దగ్గఱనున్న తక్కుపాత్రల కెఱుఁగరాకుండ నొక్కనితోఁ జెప్పురహస్యము. మఱియు నపవారితమించుమించుగ నట్టిదియే. ఇట్టి సంధులు, సంధ్యంగములు మొదలగు సామగ్రియెల్ల దశరూపకాదిగ్రంథములఁ బ్రసిద్ధంబై యుండు. ఇది యంతయుఁ బ్రాచీననాటకపద్ధతి. ఆపద్ధతి ననుసరించియే కుందమాల యనుపేర నీ నాటకరాజము రచింపఁబడెను. ఇందలికథ ఉత్తరరామచరితము. కవి దిఙ్నాగాచార్యుఁడు. ఈతఁడు కాళిదాసునకు సమకాలికుండును, తత్కవితయందు నెఱసు లెంచి యభిభవింప నెంచు ప్రతిపక్షియును. కావుననే మేఘసందేశమునఁ గాళిదాసీయననుసూచి "దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్" అని తనకవితాకన్యతో ననినట్లు శ్లేషింపఁ జేసినాఁడు. కాళిదాసునకు భవభూతికి స్నేహ మనియు భవభూతి యుత్తరరామచరితముకన్న మిన్నగ నుండవలెనని యిక్కవితల్లజుఁ డీరూపకము రచించెననియుఁ బ్రవాదము కలదు. నిజమునకు కల్పనలలో నేమి, రసములో నేమి, కవితలో నేమి, యీ రెండును గుడియెడముగ నుండును. ఉత్తరరామచరితము ననేకులు తెనిగించి తద్రసము నాంధ్రావలి కింతో యంతో చవి చూపినారు. కాని ఈ కుందమాలజోలి కెవరును పోయినట్లు నాకింతవఱకుఁ గంటికిఁగాని, చెవికిగాని సోకలేదు. ప్రస్తుతము మనశాస్త్రి ఆంధ్రలోకమున కా వెలితిఁ దీర్చినందుల కత్యానంద మగుచున్నది. ఈరెండు పాత్రములఁ దత్తత్కృతులు తెల్లనరసి తమ తమ యనుభవములకుం దగ నానంద మెనసి రసికవరులు కలహంసభూమిక నవధరించెదరు గాక యని ప్రార్థించుచున్నాను. ఇప్పని విద్యార్థుల కవశ్యకర్తవ్య మని యనియెద. మఱియు నిట్టి కృతిఁ గృతకృత్యుఁడయిన సోదరకవి యింతకన్న సరసప్రసంగములచే నాంధ్రభాషామతల్లిక నలరింపుచు చిరంజీవియగు గాక.

తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

# పీఠిక

“తే వన్ద్యాస్తే మహాత్మాన స్తేషాం లోకే స్థిరం యశః
యైర్నిబద్ధాని కావ్యాని యే వా కావ్యేషు కీర్తితాః”

రసగ్రహణపారీణులారా!

విక్రమాదిత్యకుంతలేశ్వరుల కాలమున సకలకవికులతిలక మనదగు దిఙ్నాగాచార్యవిబుధవరేణ్యుడు దివ్యసారస్వత మహావనవిహార మొనర్చి యపారయశస్సును సంపాదించెనని సర్వజనసామాన్యముగ తెలిసిన యంశమే. కాని “కావ్యేషు నాటకం రమ్యం” అను సూక్తిననుసరించి యీమహాకవి నాటకీయసర్వలక్షణమణిలక్షితమై లోకోత్తరనాయకగుణ సంగ్రథిత మగు కుందమాల యను నాటకావతంసమును నిర్మించి, గీర్వాణభాషాయోషామతల్లి నమూల్యభూషావిశేషశోభిత జేసె నను విషయము తద్‌జ్ఞులకు మాత్రమే విశదమని ప్రకృతప్రబంధపీఠికాసందర్భమున నితనియుదంత మించుకంత వ్రాయుచున్నాను.

ఇతనిది చెన్నరాజధాని యందలి కాంచీమండలాంతర్గతసింహవక్త్రపురము. ఇతఁడు బ్రాహ్మణకులజన్ముడు, బౌద్ధపండితుడు. బుద్ధావతార మన దగు కుమారదాసపండితుడు జానకీహరణమను రామకథాప్రతిపాదక గ్రంథ విశేషమును రచించెనను ప్రాచీనప్రవాదల బరిశీఁప నక్కాలమున బౌద్ధులకు గూడ నేతాదృశగ్రంథరచనలయందు స్వీయప్రతిభాప్రసారముండెడిదని యూహింపవలసి యున్నది.

మహాకవి కాళిదాసు తన మేఘదూత కావ్యమున “అద్రేఃశృంగం” అను శ్లోకములో “దిఙ్నాగానాం......” అని శ్లిష్టపదమును ప్రయోగించుటయు, తద్వ్యాఖ్యాతయగు మల్లినాథసూరి, “కాళిదాసప్రతిపక్షస్య దిఙ్నాగాచార్యస్య స్థూలహస్తావలేపాన్”... అని వివరించుటయు, ఇంత కన్న పూర్వవ్యాఖ్యాతయగు దక్షిణావర్తనాథుడు - “దిఙ్నాగ ఇతికోప్యాచార్యః కాళిదాసప్రబంధాన్ స్థూలహస్తాభినయై ర్దోషయతి” అని వ్యాఖ్యానము సేయుటయు, మున్నగు కారణసామగ్రిచే నీదిఙ్నాగుడు కాళిదాస మహాకవికి సమకాలికుడని నిశ్చయింప బడుచున్నది.

మరియు నీకవిపుంగవుడు న్యాయప్రవేశము, ప్రమాణసముచ్చయము, హేతుచక్రడమరుకము, ఆలంబనపరీక్ష త్రికాలపరీక్ష మొదలగు న్యాయ గ్రంథముల రచించుటచే తర్కశాస్త్రమున నుద్దండపండితుడని సువ్యక్తమగు చున్నది. అక్షపాద వాత్స్యాయనాది శాస్త్రకర్తలచే నాదరింపబడిన పంచావయవన్యాయమును మూడవయవములచే నొప్పించిన పండితదిఙ్నాగు డీదిఙ్నాగుడే.

చంద్రికాచండాతపములకువలె, కవిత్వతార్కికత్వముల కొకచో నునికి యసంభవమను నాక్షేపము భ్రాంతిమూలకమని తెలియపరచుచు వాత్స్య కులతిలకవరదాచార్యులు, తనవసంతతిలక భాణమున నిట్లు నుడివెను—

"తర్కేషుకర్కశతరాస్స్వ్యరథాపి పుంసాం
కాలే భవంతి మృదవః కవితాసువాచః
దైత్యేంద్ర శైలకులిశం దయితాకపోలే
నాథస్య కోమల ముదాహరణం నఖంనః."

ఈమహాకవిప్రణీతమగు కుందమాలను ప్రమాణీకరించుకొని భోజదేవ కవి తనశృంగారప్రకాశికయందు "ద్యూతే పణః ప్రణయకేళిషు......" ఇత్యాదిశ్లోకముల నుదాహరించుకొనియె. ఇట్లే సాహిత్యదర్పణకారుడగు విశ్వనాధకవిరాజు, కావ్యకామధేనుకారుడగు బహురూపమిశ్రుడు మున్నగు ప్రాచీనపండితప్రవరులీదిఙ్నాగపండితుని ప్రమాణకవికోటియందు జేర్చికొనిరి.

ఈవిధమున నీవిద్వద్దిగ్గజము కుందమాలతో గీర్వాణవాణీవధూటి నలంకరింప నాంధ్రభాషావిశారద కీలోప మపనయింపగోరియో యన్నట్లు శ్రీ కవితావతంస మిట్లు రమణీయానువాద మొనర్చి రసవిత్ ప్రపంచమున కనుపమానోపకారము జేసెనని చెప్పుట కెంతయు నుత్సహించుచున్నాను. అనువాదకౌశలము గ్రంథమున పరికింపదగు.

కుందమాల నుద్దేశించి చేయబడుటచే నీనాటకరాజమునకు కుంద మాల యను నామధేయము గలిగెను. ప్రధానప్రతిపాద్యము రామగాథ యైనను లోకవాదభీతిచే నడవులకు బంపబడిన గర్భనిర్భర సీతాదేవి ప్రథమాంకమున గంగ నుద్దేశించి "జననీ, భాగీరథీ! నే నిక సుఖప్రసవ నగుదునేని స్వహస్తగ్రథితమగు కుందమాలతో నిన్ననుదినము నర్చించు

చుండెద, ననుగ్రహింపుము" అని నమస్కరించుటయు, గోమతీతీరమున కరిగిన శ్రీరామున కీ కుందమాలమూలమున సీతానివాసస్థలము గుఱుతింప వీలగుటయు, పర్యవసానమున నీ గ్రంథమునకు ముఖ్యఫలమైన సీతారాముల వియోగదశావిచ్ఛిత్తి కీ కుందమాల మూలకారణ మగుటయు, లోనగు నిమిత్తము లీ నామధేయమునకు హేతువులు.

"యద్య ప్యంగాని భూయాంసి పూర్వరంగస్య నాటకే
తథా ప్యవశ్యం కర్తవ్యా నాందీ విఘ్నోపశాంతయే"

అను బాదరాయణ వచన ప్రామాణ్యముచే ప్రత్యాహారావతరణా రంభాదులగు ద్వావింశతిపూర్వ రంగాంగములలో నాంది ముఖ్యకర్తవ్య మగుటం జేసి ఇచ్చట—

"త్రావుఁగావుత నిఖిలాంత రాయజీవ
నధిఁ బురందరమాలిమందారకుసుమ
మాలికామధుచుంబనశీలములయి
పరగు హేరంబమృదుపదపాంసుతతులు"

అని నాంది చేయబడినది. అదియు "పదై శ్చతుర్భిః" ఇత్యాదివచన పర్యాలోచనచేచతుష్పదలక్షణ యని నిర్ణయింపదగును. అందునుశ్లోకపాదము పదశబ్దవాచ్యమగుటలో "శ్లోకపాదం పదం కేచిత్ సుప్తిఙంత మథాఽపివా" ఇత్యాది నాట్యప్రదీపకారునివచనము మూర్ధన్యప్రమాణము.

ఆశీర్వచనసంయుక్తా స్తుతి ర్యస్మా ద్విధీయతే
దేవద్విజనృపాదీనాం తస్మా న్నాందీతి సంజ్ఞితా
మాంగల్యశంఖచంద్రాబ్జకోకకైరవశంసినీ

సాహిత్యదర్పణం

చంద్రనామాంకితా ప్రాయో మంగళార్థపదోజ్జ్వలా

రత్నాపణము

త్రావుగావుత యని యాశీస్సంయుక్తముగా పురందరమాలీత్యాదిచే ప్రకృతగ్రంథరచనాదిప్రతిబంధకదురితధ్వంసహేతువగు హేరంబదైవమును స్తుతించుటచేతను, మందారమాలికా, మధు, కుసుమ ప్రభృతిమృదుపదప్రయోగమువలన వైలక్షణము లీ నాందియందు లక్షితము లగుచున్నవి.

భూదేవి వాల్మీకిమహర్షులయనుగ్రహాలబ్ధమైన పునస్సంగమరూప ప్రధానప్రయోజనము సీతారాముల నాశ్రయించుటచే నిచట సీతారాములే నాయికానాయకులు. ఉత్తరరామచరితయందువలె విప్రలంభకరుణారసము ప్రధానము రసాంతరము లంగములు.

హాస్యరసపోషణకై ప్రసన్నరాఘవానర్ఘరాఘవాదినాటకములలోలేని విదూషక పాత్రప్రవేశము చేయబడినది.

అనూద్యమానప్రబంధము, ప్రబంధకర్తృచరితమును, ఇంత ప్రతిభావంతములు, మహోదాత్తములు.

మహాశయులారా !

"రసో వై సః" శ్రుతి.
"యః స్థాయి భావరతిరేవ నిమిత్తభేదాత్
శృంగారముఖ్యనవనాట్యరసీభవంతి
సామాజికాంశ్చ హృదయాన్నటనాయకాదీ
నానందయేత్సహజపూర్ణరసోస్మి సోహమ్"

స్వాత్మయోగప్రదీపము.

ఇత్యాదిమార్గాభిషిక్తప్రమాణముల ననుసరించి, నానావిధవిమలకర్మ నిర్మలాంతఃకరణులై శమదమాదిసాధనసంపన్నులై శ్రవణ మనన నిదిధ్యాస పరులగు యోగిపుంగవులయందే రస మభివ్యక్తమై బ్రహ్మ, పరమాత్మ శబ్దలక్షిత మగుచున్నదో, ఆ బ్రహ్మానందరసముతో నైక్యీకృతములగు దృశ్య ప్రబంధములలో నొకటియై, రామకథ యనుటం జేసియు పరమపురుషార్థ ప్రాపకమగు నీ కుందమాలను పఠించి జన్మధన్యత నొందిన కృతికర్తృపరిశ్రమను సఫలము గావించెదరు గాక యని ఆశించుచున్నాను.

సంస్కృత పాఠశాల,
కొల్లాపు.

పండిత ప్రతాప హనుమచ్ఛాస్త్రి

## పాత్రలు

### పురుషులు

శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
సుమంత్రుఁడు (సారథి)
వాల్మీకి
ఒకఋషి
కణ్వుఁడు (మహర్షి)
విదూషకుఁడు
కుశలవులు
కంచుకి

### స్త్రీలు

సీత
వేదవతి } సీత చెలికత్తెలు
యజ్ఞవేది } (మునికన్యలు)
భూదేవి

# కుందమాల

## ప్రథమాంకము

తే. త్రావుఁగావుత నిఖిలాంతరాయ జీవ
నధిఁ బురందరమౌలిమందారకుసుమ
మాలికామధుచుంబనశీలము లయి
పరగు హేరంబమృదుపదపాంసుతతులు.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సీ. అరయ నూర్ధ్వగమయి పరిణతంబౌ నాంత
రిక తపోనలశిఖరీతి నలరి,
వల్మీకరమువోలె భవ్యగంగాజలో
త్తుంగతరంగభుజంగపుంగ
వావాసపదమై, సమంచితార్ద్రమృణాళ
నూతనాంకూరమనోజ్ఞదేహుఁ
డై యొప్పు రిక్కలరాయని కన్వవా
స్థాయిని నై ప్రదోషమువిధానఁ

గీ. దనరి, బాలభాస్కరునంశుగణముకరణిఁ
గపిలమై, పొలిచిన మిహికాగిరీంద్ర
జామనోహరుభారంపుజడలపిండు
ప్రోచుఁగావుతఁ గూర్మి మిమ్ముల సతంబు.

ఆరాలపుర వాస్తవ్యుండును, కవికులతిలకుండును, అగు దిఙ్నాగాచార్యప్రణీతం బయిన కుందమాల యను నాటకరాజము నభినయించి మాకనులపండువొనర్పు మని మహాశయుల యాజ్ఞ యైనది. తత్సందర్భ ప్రయోగ సహకారిణి యగు నాసఖి యింతదనుక రాక యేలనో తడవు సేయుచున్నది. ఒకమాఱు పిలిచి చూచెద............ ప్రేయసీ! ప్రేయసీ!

(నేపథ్యమున)

ఆర్యారాలా! ఇచట స్యందన మవరోహింపుము

సూత్ర—(ఆలోచించి) ఈ మహాపురుషుం డెవ్వండై యుండును? ఆర్యాసమాహ్వానముచే నాకు సయితము సహాయమును గావించుచున్నటు లున్నాండు. (చూచి) అక్కటా! ఎంత కష్ట మెంతకష్టము?

గీ. రావణునియింట నుండెం జిరం బను నప
వాదభీతి రాముండు జనపదమునుండి
వెడలంగొట్ట గర్భిణి పృథ్వీజ నటవు
లకిదె కొనిపోవుచున్నాండు లక్ష్మణుండు.

(నిష్క్రమించును)

(ఇది స్థాపనము)

(రథారూఢులై సీత, లక్ష్మణుడు, సారథి ప్రవేశింతురు.)

లక్ష్మ—ఆర్యురాలా! ఇచట స్యందన మవరోహింపుము. గహనతరులతాగుల్మములు మిక్కిలి దట్టముగా నుండుటచే నీ భాగీరథీతీరకాంతారములు రథసంచారమున కనుప్రకాశకున్నయవి. కాన ఆర్యురాలా! స్యందన మవరోహింపుము.

సీత—వత్స! లక్ష్మణా! మనోజవములగు నీ వారువముల ధావనవేగముచే నా యొడ లంతయు కంపించి పోయినది. బాగుగా రథముపైఁ గూర్చుండుటయే నా కసాధ్యముగ నున్నది. ఇంక దిగు టేడ?

లక్ష్మ—అట్లయిన సుమంత్రా! గుఱ్ఱముల నాపివేయుము.

సుమం—గాంధర్వప్రియము లగు నీ అశ్వములు నాప్రయత్నము నతిక్రమించి పరుగెత్తుచున్నవి.

గీ. శ్రవణసుహరంబులం దమంద్రగతిఁ బఱుప
కృష్టకలహంసకలరవాకృష్యమాణ
ము లయి పఱచుచున్నవి హయములు రయంబ
సరకుసేయక ప్రగ్రహసంయమంబు.

లక్ష్మ—సుమంత్రా! సంతోషాతిశయమున నినుమడించిన వేగమున నీజవనాశ్వములు మెఱకపల్లములు విచారింపక పరుగిడుచు గంగాప్రపాతమున రథము బడవైచునేమో యను భయము గలుగుచున్నది. సత్వరముగ వీని నాప సంపూర్ణప్రయత్న మొనరింపుము.

సుమం—(రథ్యము బాగును.)

లక్ష్మ—దేవీ! ఇదిగో రథ మాగినది. ఇంకఁ గంగ జాగరూకతతో దిగుము.

సీత—(అలసత్వముతో రథము దిగి యిటు నటు పచారు సేయుచుండును.)

లక్ష్మ—సుమంత్రా! దూరప్రయాణమువలన నీగుఱ్ఱములు మిక్కిలి అలసిపోయినవి. ఆచెట్టునీడకుం గొనిపోయి వీని శ్రమమును దూరముసేయుము.

సుమం—దేవ యాజ్ఞ. (గుఱ్ఱములతో నిష్క్రమించును.)

లక్ష్మ—(పరిక్రమించి) (తనలో, దుఃఖముతో)

"సీత రావణునియింట నున్నకతన నామెచరిత్రముపై పౌరుల కెన్నియో శంకలు వానిమి పలు తెఱంగులగు ప్రవాదములు వెలువడుచున్నవి. ఒక్క సీతమూలమున శరచ్చంద్రచంద్రికాధవళములగు నిక్ష్వాకుకులకీర్తికిఁ గళంక ముత్పాదింపఁజాల. సీతయు గర్భవతి యగుటచే మున్నొకనాఁడు స్త్రీస్వభావమున భాగీరథీదర్శనమునకై నన్ను ప్రార్థించినది. నేనును అందుల కియ్యకొనియుంటిని. నాఁడువ నీవీగంగాతీరగమనవ్యాజమున సుమంత్రాధిష్ఠిత మగు రథము నెక్కించికొని కొనిపోయి సీత నెందేని యొకభీకరారణ్యమధ్యమున విడిచివచ్చి యింటికి మఱలి రమ్మ"ని ఆర్యపుత్రుఁడు—అట్లుగాదు స్వామియగు రాముఁడు ఆజ్ఞాపించియున్నాఁడు. తదనుసారము స్వజనుఁడ నగు

నాపైఁ గల నమ్మకమున నిర్వ్యాశంకయగు నీసీతాదేవిని గృహపాలితయగు హరిణిని వధ్యభూమికిఁ బోలె విపిన ములకుఁ గొనిపోవుచుంటిని. దైవమా! నన్నిట్టికార్యము నకుఁ బాపుచుంటివి? సీతారాములకు నాచేతులమీఁదుగ ఎడబాటు కలుగవలయునా? (విచారము నొందును)

సీత—లక్ష్మణా! సంపూర్ణగర్భభారభరణముచే నాచరణ ములు తడబడిపోవుచున్నవి. నే నిఁక నొక యడుగైన నిడఁ జాల. పరమపావనియగు భాగీరథీధుని మన కిఁక నెంత దూరమున నున్నదో చూచి వచింపుము.

లక్ష్మ—అమ్మా! భాగీరథి సమీపముననే యున్నది. మన మును చేర వచ్చితిమి. విషాద మందకుము. చూడుము—

ఉ. అంది మనోహరాంబుజవనాంతరసూనమరందగంధముల్
డెంద మెలర్పఁ దెచ్చుచు లలిం గలహంసకలారవంబులన్
సందడిగాఁగఁ జిమ్ముచు లసల్లహరీహిమబిందువుల్ త్వదా
నందనకాంక్షఁబోలె నృపనందని! వచ్చెడి గాంగవాయువుల్.

సీత—(స్పర్శ మభినయించి) ఇత్తఱి జననీకరస్పర్శసుఖశీతల మగు గంగాతరంగానిలస్పర్శమువలన మార్గాయాస ముతోఁబాటు పాపములును నశించినవి. అయినను గర్భ కౌతుకము పరమపావనియగు గంగానదియందు స్నానమాడ నా కత్యంతోత్సాహము గలిగించుచున్నది. కాని దీర్ఘ ప్రయాణముచే కడు నాయాసము నొందియుంటినిగాన ఈతటప్రపాతమునుండి నీటిదరి కతిసుఖముగఁ జేరునటుల నాకుఁ ద్రోవ జూపుము.

లక్ష్మ—(చేతితోఁ జూపుచు) నిర్మానుష్యములగు నితటప్రదే
శములు మనుష్యసంచారమున కసాధ్యములుగా నున్నవి.
కావున పాదాగ్రమును నేల మోపి బాగుగా —

గీ. వామకరమున నీవారపఙ్క్తిఁ బూని
తదితరము జానువున నిడి తనర నాదు
నడుగుల న్మెల్లమెల్లన నడుగు లిడుచు
రమ్ము తృణనాల మీఁదైన రామపత్ని!

సీత—(అట్లే గావించి) లక్ష్మణా! ఆయాస మధికముగా
నున్నదిగాన యీచెట్టునీడం గూర్చుండి యొకముహూ
ర్తము విశ్రమించెద.

లక్ష్మ—చిత్తము.

(సీత చెట్టునీడఁ గూర్చుండి విశ్రాంతి నొందును)

లక్ష్మ—(పరిక్రమించి ఆహా! పుణ్యాత్ము లెచట నున్నను
సుఖసాధనములు వారికి సమీపముననే యుండును గదా!

ఉ. శీతసతోయవాతములఁ జెచ్చెర వీవఁబొడంగె వీచికా
వ్రాతము, తొల్చుచున్న దదిరా! కలహంసకలారవంబు
సంగీతము, కౌఁగిలించి స్వసఖిక్రియ హాయిని గూర్చె నీడ,
యీసీత సెలంగె శూన్యవనసీమలనైన సదాసిపోలికన్.

సీత—లక్ష్మణునివాక్యము నిజమే. ఇచటనైతము నామనము
స్వజనులతోఁ గూడియున్నట్టులే అత్యంతానందకందళిత
మగుచున్నది.

లక్ష్మ—(తనలో) ఈసీతాసాధ్వి బహిరిక తీఁ సుఖోపవిష్టయై యున్నది. రామనిర్ణీతమగు కార్యము నాచరింప తగిన సమయ మిదియే. (త్వరగా పోయి సీతపాదములపైఁ బడి) నిరంతరప్రవాససంజనితదుఃఖభాగియు లక్షణహీనుఁడును అగు లక్ష్మణునివిన్నపము నీహృదయ మొకింత స్థిరము గావించుకొని యాలింపుము.

సీత—(తొట్రుపాటుతో) ఆర్యపుత్రుఁడు సేమమేగదా ?

లక్ష్మ—(వనమును జూపుచు) ఇట్టిస్థితియందు రాముఁడు సేమ మెట్లుండగలదు?

సీత—మీపెదతల్లియగు కైకేయి మఱల వనవాసమున కాజ్ఞాపించెనాయేమి ?

లక్ష్మ—వనవాసమునకుమాత్రము ఆజ్ఞ యైనది. కాని కైకచే మాత్రము గాదు.

సీత—అయిన మఱెవరిచే ?

లక్ష్మ—ఆర్యపుత్రునిచే.

సీత—ఆర్యపుత్రునిచేతనా ? అదెట్లు ?

లక్ష్మ—(కన్నీటి నాపుకొనుచు)

గీ. అగ్రజన్ముఁ నాన యని కడు యతనంబు
తోడ విన్నవింపఁదొడఁగుచుంటిఁ
గాని నాదుహృదయగహ్వరంబున మఃడి
వైచుచున్న దకట! వాణి యిపుడు.

సీత—(దుఃఖముతో) ప్రియమైన లక్ష్మణా! ఈక్షణమునుండియు నే వనవాసక్లేశ మనుభవింపవలసినదే?

లక్ష్మ—అమ్మా! ఈవనవాసము నీకుమాత్రమే గాదు, తనకుకూడ—

సీత—తన కెవరును ఆజ్ఞాపింపలేదుగదా?

లక్ష్మ—ఒక రాజ్ఞాపింపవలయునా?

చ. అలరు సుమచ్ఛయంబు స్వగృహోద్యమునందు రసఘట్ట—
యుతమగు చెలంగు బసాదముం దమి భుజింపుచు నిత్య
సమూహకాంక్షోద్వేలల మవు నింట నున్కి విపినంబుల
వాసము కాదె? చండసుతు లజుం కెన్న నూత్నసుమ
కోమలి! నీవుప్రవాస మబ్బెనన్.

సీత—లక్ష్మణా! నేటి నావనవాస మాత్మపుత్రునివలన నెట్లయ్యెనో స్పష్టముగఁ దెలుపుము.

లక్ష్మ—మందభాగ్యుఁడనగు నే నీక నేమని తెలుపువాఁడ?

గీ. వినుము చారిత్రగుణశాలి విమలయశుఁడు
రామచంద్రుఁడు త్యజియించె రమణి! నిన్ను
అబల! ఏ నీక ని న్నొంటి నడవి డించి
యరుగఁగావలె వీటికి నానతిమ్ము.

సీత—హా మామా! కోసలాధిపా! ఇత్తఱి నీవు దివంగతుఁడ వయితివికదా! (మూర్ఛిల్లును)

లక్ష్మ—(వడఁకుచు) అతికష్టమతికష్టము! నిర్ఘాతపాతదారుణ మగు నీపరిత్యాగవార్తాశ్రవణముచే భూపుత్రి నిక్కువ

ముగ నసువులు బాసినది. (పరిశీలించి చూచి) భాగ్య వశముగ మఱల శ్వాసలు విడచుచున్నట్టులున్నది. అయి నను ఈమెను సంపూర్ణముగ సచేతనురాలిం జేయదగు నుపాయమెయ్యది? (విషాదము నందును) (సీత కొంచె మటు నిటు కదలును) ఆహా! ఏమి నాఅదృష్టము!

చ. అతితరపూతజహ్నుతనయాఝరశీకరశీతలంబునై
హితమతి మందగంధవహ మెక్కుడు సేవ లొనర్ప, నాదు
విస్తృతమవు తొంటిభాగ్యమవశేషము బోధనసేయ,
నెట్టిటో క్షితిసుత మెల్లమెల్లన సచేతనురా లయి యొప్పెం
గ్రమ్మఱన్.

సీత—(మెల్లగ లేచి కూర్చుండి) లక్ష్మణా! పోయితివా యేమి?

లక్ష్మ—లేదు, లేదు. ఇచటనే యుంటిని. ఏమి యాజ్ఞ?

సీత—న న్నెట్టిదోషముచే ఆర్యపుత్రుండు డడవుల కంపివైచెనో యెఱిగింతువా?

లక్ష్మ—జనకతనూజాతయెడ నెట్టిదోష ముండగలదు?

సీత—అక్కటా! ఏమి నాదురదృష్టము? ఏదోషమును లేకయే ఆర్యపుత్రుడు నన్ను శిక్షించెనా! లక్ష్మణా! మనల నడవులకు పంపివేయునపుడు నానాథు డేమైన నీతోం జెప్పియుండెనా?

లక్ష్మ—ఆ. ఒకసందేశము నంపియున్నాడు.

సీత—ఏదీ వచింపుము.

లక్ష్మ —

చ. సమరములందు వంచు, గుణసంఘసమాన వటంచు, సద్గుణౌ
ఘమహితు వంచు, నెల్లపుడుఁ గష్టసుఖంబులఁ దోడునీడ
వంచు మది నెంచియుండి విడచుచుంటిని నిజ్జనవాద
ఫలితమాత్రమునన భావదోషముకతంబునఁ గాదు నిజంబు
జానకీ !

అన్యపుత్రుఁ డీవిధముగనే వచింపుమనెను.

సీత— ఆలాగు నాథయ మెట్టిది? మఱేమైనఁ గలదా ?

లక్ష్మ— అగ్రజాజ్ఞావశు నీ కేమని వచింపఁగలవాఁడ ?

గీ. అరయ నింద్రాదిలోకపాలురు ఋషీంద్రు
లేను నెల్లరుఁ గనుఁగ నీక్షింపుచుండ
ననలశుద్ధిని గొంటి వీవపుడు కాని ...
... ... ... ... ... ...

సీత—(సిగ్గుతో తల వ్రాల్చి) చెప్పుము. కాని ...

లక్ష్మ— ...తరుణి ! లోక మంకుశరహితంబు గాదె ?

సీత—అనలశుద్ధి యనుటచే నాటి లంకానివాసవృత్తాంత మంతయు జ్ఞాపకమునకు వచ్చి నాదేహ మాపాదమస్తకము వడఁకి పోవుచున్నది. స్త్రీ యగుటచే సీతయందే లోకము పాప మాశంకించుచున్నది. ఆఁడుపుట్టు వెంత నీచము? కావుననే నాథునిచే త్యజింపఁబడితిని. (కొంచెముసే పూరకుండి మరల నాశ్చర్యముతో) నిజముగాఁ ద్యజింపఁ

బడితినా? నిర్దోషురాలును నింపఁపూలాలును అగు నే
నన్నైక్కసవతికిమాఁపునిత్తో? సహవాసమే నైనను నీగర్భస్థ
సంతానముఁ రాఘవకులమూలాధారము కావున అతి
జాగరూకతతో కాపాడుకొనవలసియున్నను. అందువలన
కంటకప్రాయమగు జనాపవాదశంకాకీలితమైన నాజీవితము
నెట్టెటో రక్షించుకొనియెద.

లక్ష్మ—అనుగృహీతుండ నైతిని. (నమస్కరించి) ఆర్యపుత్రుఁ
డింకొకటి వచింపు మనెను.

సీత—అ దెయ్యది ?

లక్ష్మ—

ఉ. దేవి! తలంప నాహృగృహదేవత వీవ, మదంతరంగసం
భావిత వీవ, స్వప్నమునఁ బానుపు జేరెడు నన్నుమిన్నయు
న్నీవ, నిజంబు లాలితరుణీమణిచేయి గ్రహింప నొల్ల నే
నేవిధినైన, నీప్రతిమయే యజనంబున ధర్మపత్ని యౌ

సీత—ఆర్యపుత్రుఁ డీరీతిగ సెల వొసంగుటచే పరిత్యాగ
దుఃఖమంతయు రూపుమాసినది. పరదారాసక్తుఁడగు
పురుషుడు పరమసాధ్వియగు తనతరుణీమణికి గలిగించునంత
దుఃఖమును పరాసక్తయగు వనిత తనపురుషునకు గలి
గింపఁజాలదుకదా!

లక్ష్మ—(దోసి లొగ్గి) ఇఁక ప్రతిసందేశ మేమి?

సీత—ఎవరికి ?

లక్ష్మ—ఆర్యపుత్రునికి.

సీత—ఓహో! ఆర్యపుత్రుఁడు నాసంబంధ మిసుమంతయు నొల్లక త్యజించుచుండ ప్రతిసందేశముకూడనా ? అయి నను నాఅత్తలగు కౌసల్యాకైకేయీసుమిత్రలతో చరణ ములకెఱఁగి—మనోహరుఁడు త్యజింప సింహశార్దూలాది భయంకరజంతుసంతాన సంతతసంచారసంభరిత మగు నిశాంతారగర్భమున దిక్కు లేనిదాననై పడియున్న న న్నెన్నఁడును మఱువవలదని సీత విన్నవించె—నను ము.

లక్ష్మ—చిత్తము. ఆర్యపుత్రున కేమియు వచింపవా?

సీత—లక్ష్మణా! నీవెంత ధన్యుఁడవోయి! కఠోరహృదయుఁ డయ్యును నానాథుఁడు నీప్రేరణచే సందేశింపఁబడు చున్నాఁడు. ప్రేమపూర్వకముగా నా మనోహరునకు వర్తమాన మంపికొనునంత భాగ్యము నానుదుట వ్రాయఁ బడియుండ లేకగదా! (విచారము నొంది మఱల) మంద భాగ్యనగు నన్ననవరతము తలపోసి నాకై విలపించుచు రాచకార్యములను వదలి వర్ణాశ్రమపరిపాలనమున విము ఖుఁడవై తనకు స్వవిఘాతమును దెచ్చిపెట్టుకొనక సత్పురు షాచరితమగు ధర్మమందును, నిజశరీరమందును సావధానుఁ డవై యుండు మంటి—నని నానాథునితో విన్నవింపుము. లక్ష్మణా! అభూకాంతు నేమైన నిందించుచుంటినా?

లక్ష్మ—నిష్కారణముగ నెన్నఁడును కని విని యెఱుంగని యిట్టి యిక్కట్టులపా ల్సేసిన యాతనిని నిందింపఁగూడదా? అట్లు నిందించుటకు సాధ్వీశిరోమణి యగు విదేహరాజ తనూజ తగదా ?

సీత—అయినను నిందింపజాల. అంతియగాక లక్ష్మణా! నిర్దోషురాల నగు నన్ను దేశముతో బని యేమి! నీ హృదయముననుండిమాత్రము దూరము సేయు టుచితము గా దంటి నని నీయన్నతో విన్నవింపుము.

లక్ష్మ—ఆహా! తగునట్లు సందేశించితివి.

గీ. ఇంటనుండియు ని ల్లననేల, స్వవిష
యముననుండి నిర్వాసిత నైతి కాని
చాన! ప్రభవిష్ణుఁ డా రామచంద్రుని హృద
యముననుండి నిర్వాసిత వౌదు వెటులు?

సీత—మఱియొక టాలింపుము—తపోవనవాసినియగు జనక నందని బద్ధాంజలియై— నేను దోషరహిత ననియు, చిర పరిచిత ననియు, ఈసమయమునమాత్రము దిక్కులేని దానననియు, సీత ననియు, ఆర్యపుత్రునిచే నొకప్పుడు గాకున్న నొకప్పుడైనను స్మరణమాత్రముననైన ననుగ్ర హింపఁబడుచుందునుగాక యని మాటిమాటికి విన్నవించు కొనియె —నను.

లక్ష్మ—అట్లే కావించెద. కాని—

గీ. వ్రణసమాహితమైన క్షారంబుకరణి
నతులపీడాకరమగు నీప్రతివచనము
విని నిజంబుగఁ గాంచు నమ్మనుజవిభుఁ డ
సహ్యమా శోకభారంపుచరమగతిని.

సీత—అత్యంతగౌరవపూర్ణమైనను నిజరాష్ట్రమున స్త్రీ పురుషులెల్లరు సుఖసమయమున నార్యపుత్రునకు సాయపడవచ్చునా? కల్ల. కాన యిపుడు నేనడవుల నుండినను నీ వొక్కఁడవే ఆర్యపుత్రునిశరీరసంరక్షణమున సతిజాగరూకుఁడవై యనుక్షణ మాతనిస్థితి నాలోచించుచుండవలయునుసుమా.

లక్ష్మ—తల్లీ! మహానుభావత్వమున కియ్యది యొప్పు.

సీత—లక్ష్మణా! రాఘవకులరాజధానియగు అయోధ్యాపురికి నావచనముగఁ బ్రణామిల్లుము. ప్రతిమాగతుఁడగు దశరథ ధరణీకాంతు ననుదినము శుశ్రూషించుచుండుము. నాఅత్తలగు మీముగ్గురు తల్లుల యానతిని శిరసావహింపుము. ప్రియంవదలగు నాసఖురాండ్రకు నాక్షేమవార్త నెఱింగించి వారివిచారమును దూరముసేయుము. మందభాగ్యురాల నగు నన్నెన్నఁడును మఱువక జ్ఞాపకముంచుకొనుము. (ఏడ్చుచు నేలపైఁ గూలును.)

లక్ష్మ—(దుఃఖముతో) అక్కటా! పతివ్రతాశిరోమణియగు రామునిపట్టమహిషి యనుభవించు క్లేశపరంపరలను నా కన్నులార జూచుటకు తొలిజన్మమున నే నెంతపాపము చేసికొంటినోగదా! మఱియు—

చ. విమలచరిత్ర సీత నటవిన్ స్వకరంబుల నొంటి డింప దే
హ మలయ నేలపైఁ బొరలు నాపెవిలాపము నాలకింప
నాఁ డమితభయంకరంబగు మహారణభూమిని నీల్గినట్టినన్
జెమటల నోడ్చి మారుతి సజీవునిఁ జేసె నుపాత్తవైరుఁడై.

(నలువైపులఁ జూచుచు)

చ. హరిణము లేడ్వసాగె ముఖమందలి పూరిఁ దినంగ మాని,
 ఆ ల్గిరుగఁగ హంసపంక్తులు గార్చుచునున్నవి బాష్ప
 ధారలన్, సరగున వీడుచున్నయవి నాట్యము నెమ్మలు
 సీత గాంచి యీ కరుణయె లేని మానవుల కంటెను
 శ్రేష్ఠము తిర్యగోఘమే.

సీత—(లేచి) లక్ష్మణా! సూర్యుఁ డస్తాద్రిమాటున డాగ
 నున్నాఁడు. మనుష్యసంచారగోచరమగు ప్రదేశ మిచటి
 కతిదూరమున నున్నది. పక్షులు తమతమ గూండ్ల
 కేగుచున్నవి. అవిగో చూచితివా! పెద్దపులులు పొదలలో
 నుండి బొబ్బలిడుచు పరుగిడుచు వచ్చుచున్నవి. ఇంక
 నాలస్యము సేయదగదు. పొమ్ము. పురికి మరలి పొమ్ము.
 ఆర్యపుత్రుడు భద్రముసుమా!

లక్ష్మ—(అంజలి మోడ్చి) ఈలక్ష్మణుని తుదినమస్కారము
 గైకొనుము. అమ్మా! భయంకరమగు నిక్కాంతార
 గర్భమున కడు జాగరూకవై యుండ వేఁడెద.

సీత—నాకే భయమును లేదు. పొమ్ము. అంధకారము నలు
 వైపుల గ్రమ్ముచున్నది.

లక్ష్మ—దేవీ! ఈదీనుని విన్నప మొకటాలింపుము.

చ. నిరతము నీమనోహరుని నెచ్చెలిపిండును నెల్లవిందులన్
 స్మరణ యొనర్చి శోకమునఁ బ్రాణముపేడఁ దలంప కిప్డు భా
 స్కరకులవర్ధనం బయిన సంతతి నీశుభగర్భసంస్థమై
 పరగెడు దాని యత్నమునఁ బాలనసేయఁగదమ్మ జానకీ!

సీత—నా కవిషయము నంతగా బోధింపవలయునా?

లక్ష్మి—ఈయభాగ్యని మఱొక మనవి—

సీత—ఏ మది ?

లక్ష్మి—

ఉ. భామిని! నామనగ్రజునిపంపున నున్నతరత్నహర్మ్యపుం
భూములనెచ్చెలుల్ గొలువ భూరిసుఖంబులఁ గన్న నిన్ను
నింకేమి వచింతు? డించితి నిదే జనశూన్యభయంకరాటవీ
సీమల, నైపుమా జననీ! చెచ్చెర నాదగు నేకదోషమున్.

సీత—ఇందు నీదోస మేమున్నదోయి? అగ్రజునియాజ్ఞ
శిరసా వహించువాఁడవుగదా నీవు?

లక్ష్మి—(సీతకు ప్రదక్షిణముసేసి నమస్కరించి నాలు గడు
గులు వైచును.)

సీత—(ఏడ్చును.)

లక్ష్మి—(నలువైపులఁ జూచి) ఓలోకపాలురారా! ఇటు
వినుఁడు,

గీ. కుతలి రఘుమౌళి దశరథుకోడ లిపై

సీత—ఆహా! అతిశ్లాఘనీయములగు నక్షరములు నావీనులకు
విందు లొనర్చుచున్న వే.

లక్ష్మి—...రామనామాంచితుఁడగు శ్రీరమణుగృహిణి

సీత—అయ్యొ యిట్టి యిక్కట్టులపాలయితిని.

లక్ష్మి—పతిపరిత్యక్తయయ్యె...

సీత.—(చెవులు మూసికొనును)

..........ఈభయదవిపిన

భూమి నసహాయనుగా నీవెం బ్రోవవయ్య.

సీత—(గర్భమును జూపుచు) నన్ను గావు. ఈగర్భస్థమగు నిక్ష్వాకుసంతతిని......

లక్ష్మ—సీతకొఱకై యీభాగీరథినిగూడ వేడుకొనియెద.

ఉ. ఫుల్లపయోజగంధపరిపూర్ణములై శ్రమ మాపఁ జాలునీ
చల్లనియూర్మివాయువుల జానకి నేలఁగనమ్మ శ్రాంతి వా
టిల్లినవేళ, జాహ్నవి! సుడిం బడుత్రోయుచుయుం బోకింతగా
మెల్లనసేసి సేమ మిడుమీ నృపపుత్రికి స్నాన వేళలన్.

చ. పొలఁతుక ముద్దరా లబల పుణ్యచరిత్ర మగండు వాడుచే
విడచినదాన సద్గుణ గభీరవనాంతరసంస్థ నిండుచూ
ల్గలిగినలేమ రక్షకుఁ డొకండును లేనిది సత్కులీన యీ
యిలసుతఁ బ్రోవుఁడీ కరుణ నివ్వనసీమల మానిసత్తముల్.

గీ. కఠినపాషాణతలమునఁ గనులు మూసి
నిదురఁగొనెడువేళఁ బ్రమాద మొదవినపుడు
ఆపదంబడుతఱి సీత నరసి ప్రోవ
రారె యోవనదేవతలార! మీరు.

సీ. శ్రీరామురమణి వసించు నిచ్చోటు వాసి
మీ రేఁగరే హింస్రమృగములార!
నెచ్చెలుల్ వలె నీపె నిముసమేనియుఁ బాయ
కరసి ప్రోవరె మృగతరుణులార!

భ్రాతృత్వ మలరార రక్షింపరే మీర
లవనీజ నవనీరుహంబులార!
తిలకింపరే యీసతీతిలకము నెప్డు
కరుణ నైవార భూధరములార!
గీ. శరభశార్దూలమహిష కేసరివరాహ
ముఖ్యజంతుసంచారసంపూర్ణమగు మ
హోగ్రవనసీమ నీసాధ్వి నొంటి డించి
పోవుచుంటిని మొఱఁగునై పురికి మఱలి.

(అని మెల్లమెల్లగా నిష్క్రమించును.)

సీత—లక్ష్మణుఁడు తా ననినయట్టులనే న న్నిచట నొంటరిగా విడచి చనినాఁడు. అక్కటా! దివాకరుఁ డపరాంబుధిఁ గ్రుంకినాఁడు. లక్ష్మణుని కంఠధ్వని యైనను వినవచ్చుట లేదే. ఇఁకెక్కడి కంఠధ్వని! ఆతఁ డీపాటికే పురసమీపమునకరిగి యుండును. (నలువైపులఁ జూచి) అవిగో హరిణములును తమతమ నెలవుల కరుదెంచుచున్నవి. పతంగము లఱచుచు తమగూండ్లకు జేరుచున్నవి. (భయముతో) అబ్బా! అవిగో బెబ్బులులు బొబ్బలిడుచు కనులనుండి అగ్నికణంబులు రాల నావైపునకే పరుగిడుచు వచ్చుచున్నవి. బంధురమగు నీయంధకారము నాకన్నులనుగూడ కప్పివేయుచున్నది. అతిభయంకరము, నిర్మానుష్యము, అశరణము గదా యీమహారణ్యము. దైవమా! నే నేమిచేయుదాన? దిక్కులేనిదాన నయితినే. ఎచటి కేగుదు? నిరంతరవిరహవేదనాదోదూయమానమానసనై పడరాని పాట్లు

పడ తొలిపుట్టువున నెట్టి పాపము చేసియుంటినోగదా! లక్ష్మణుండు బ్రతిమాలి మొఱపెట్టుకొని పోయినను యీ వనదేవతలకు నాగోడవ కనులపడుటకు వయ్యెనాయేమి? కాకున్న పలుకరాదేల? రాఘవకులక్రమాగతులగు వాల్మీకి వసిష్ఠాది మహర్షిసత్తములుగూడ నిపుడు నన్ను త్యజించి......(దుఃఖమున మూర్ఛిల్లును)

(వాల్మీకి ప్రవేశించును.)

వాల్మీ—(తొట్రుపాటుతో వెదకుచు) అసహాయురాలై దిక్కులేక అతిదీనముగా నేడ్చుచున్న నిండుచూలాలగు నొక సతీతిలకము గంగానదిఒడ్డున మాకగుపడినదని యిప్పుడే గదా సంధ్యాకాలమున సుస్నాతులై గంగానదినుండి మరలి వచ్చిన మునికుమారులు తెలిపినది? నేను కొంచెమైన నాలస్యము చేయలేదే. ఎంత వెదకినను ఆమె నాకగుపడదేల? కానిమ్ము, మరల నింకొకమారు వెదకి చూచెద.

(నలువైపుల వెదకుచు ఒక చెట్టుచాటుననుండి చూచును)

సీత—(మూర్ఛ తెలిసి) ఆచెట్టుచాటుననుండి తదేకదృష్టితో నన్జూచుచున్న యీవ్యక్తి యెవరై యుండునోప్పు? (విచారించి) ఎవరును గాదు. ఆజ్ఞాపాలన నిరతుండగు లక్ష్మణుండు ప్రార్థింప గంగాతరంగిణి మంగళతరంగములచే నన్ననుగ్రహించుచున్నదిగాని వేఱొండుగాదు.

వాల్మీ— కనులు పొడిచికొనినను కానరాని యీయంధకారము దృష్టిప్రసార మతికష్టముగ నున్నది. కావున మాట్లాడి చూచెద (సీతతో) అమ్మా! నే నిదే వచ్చితిని.

సీత—(సంతోషముతో) లక్ష్మణా! మఱల నన్నయోధ్యకు కొనిపోవ వచ్చితివా యేమి?

వాల్మీ— నేను లక్ష్మణుఁడను గాను.

సీత—(భయముతో) అయ్యో? ఇతఁడు లక్ష్మణుఁడు గాఁడఁట. మఱల నెవఁడో నరాధము డొకఁడు మాయవేషముతో నరుదెంచియున్నాఁడుగాఁబోలు. ఈ అనర్థమెట్లు తొలఁగి పోఁగలదు? (విచారించి) అక్కటా! దిక్కులేనిదాననై అసువిడుచుటకైన నోపిక లేక ఇట్టి యిక్కట్టులందుచుంటినే. దైవమా! ఆరాఘవుఁ డింక నాకన్నుల కగుపడునా! (ఏడ్చును)

వాల్మీ— అమ్మా! ఏడ్వకుము. నారాకవలననే నీకష్టము లన్నియు తొలఁగినవని యెఱుంగుము. దివసావసానసవనార్థము భాగీరథీస్నాతులై వచ్చిన మునికుమారులవలన నీవృత్తాంత మంతయు విని నిన్ను రక్షింప పరుగుపరుగున వచ్చితిని. నే నొక తాపసుఁడను. ఎవఁడో మాయగాఁడని భావింపకుము. నిజముగ నిన్ను కాపాడుటకే వచ్చితి నని నమ్ముము.

గీ. రమణిరో! ధర్మసంగ్రామరంగమందు
రావణుని రూపుమాపి శ్రీరామవిభుఁడు

క్ష్మావలయ మేలుచుండ నకంటకముగ
నిట్టి యిక్కట్టు లిపుడు నీ కెట్టులొదవె?

సీత—ఆమహానీయుని వలననే నా కీగతి సంభవించినది.

వాల్మీ—శ్రీరామచంద్రునిమూలముననే నీ కీ కష్టములు సంభవించినవా?

సీత—చిత్తము.

వాల్మీ—వర్ణాశ్రమవ్యవస్థాభూతుఁడగు నారామునిచేతనే నీవు నిర్వాసిత వయితివేని నీకు మంగళమగుఁగాక. దుఃఖింపకుము. నే నిదే ఆతనిపాలికిఁ బోయి తగిన హితవు గఱపి వచ్చెద. అంతదనుక నీ విచటనే జాగరూకతతో నుండుము. (పోఁబోవును)

సీత—స్వామీ! నావిన్నప మొక టాలింపుడు.

వాల్మీ—ఆదేద్దియో త్వరగా తెలుపుము.

సీత—రఘువరునిచే విడనాడఁబడితి నని నన్ను రక్షింప మీరు శ్రమంపడవలదు. కాని రఘుసగరదిలీపదశరథాది మహానీయుల కులదీపకమగు నాగర్భస్థ సంతానమును కాపాడ న న్ననుగ్రహింప వేఁడెద.

(పాదములకు నమస్కరించును)

వాల్మీ—అట్లే కావించెద. లెమ్ము. అమ్మా! అట్లయిన నీవు దశరథుని కోడలవా?

సీత—చిత్తము.

వాల్మీ—విదేహాధిపతియగు జనకుని తనయవా?

సీత — అవును.

వాల్మీ — సీతయేనా నీనామధేయము?

సీత — సీత గాదు, దిక్కులేనిది.

వాల్మీ — హా! ఎంతకష్ట మెంతకష్టము? త్రిలోకాధిపతియగు శ్రీరామునిల్లాలికా యిట్టియిక్కట్లు సంభవించుట! నీనూత్న రత్నస్తంభనిర్మితములగు నున్నతప్రాసాదముల రత్నగోలికల నూగెడు నీ భయంకరారణ్యములకు విభునిచే ననుపఁబడ నెట్టితప్పిద మొనరించితివి?

సీత — (సిగ్గుచే తల వంచును)

వాల్మీ — బిడ్డా! సిగ్గిలకుము. దివ్యజ్ఞానముచే నంతయు నేనే తెలిసికొనియెద. (కనులు మూసికొని ఆలోచించి మఱల తెఱచి) దారుణమగు లోకాపవాదముచే రాముఁడు నిన్నడవిపాలు గావించినాఁడుకాని హృదయముచేమాత్రము గాదు. నిరపరాధురాల వగుటచే నీవు మాకపరిత్యాజ్యవు. రమ్మ, ఆశ్రమమునకుఁ బోదము.

సీత — స్వామీ! దయామయులగు మీ రెవరో నా కెఱిఁగింతురా?

వాల్మీ — తెలిపెద వినుము —

గీ. చాన! నీజనకుండగు జనకధరణి
పతికి దశరథునకు నేను బాలసఖుఁడ
పేరు వాల్మీకి యందురు వినుము నీకుఁ
దండ్రియు న్మామయు నగుదుఁ దథ్య మిదియు.

సీత — మహాత్మా! పాదాభివందనములు (పాదములకు నమస్కరించును.)

వాల్మీ — వీరమాత వగుదువుగాక. అనతికాలమున నీభర్తృదర్శనభాగ్య మబ్బుఁగాక.

సీత — తండ్రీ! మీదర్శనభాగ్యమున నా వెత లన్నియు నడుగంటినవి. ఇఁక ఆశ్రమము జేరబోవుదము పదండు. (నిలచి నమస్కరించుచు) జననీ భాగీరథీ! నేనిఁక సుఖప్రసవ నగుదునేని స్వహస్తగ్రథితమగు కుందమాలతో నిన్నుదినము నర్చించుచుండెద ననుగ్రహింపుము. (నడువసాగుదురు)

వాల్మీ — (వెనుకకు దిరిగి) సీతా! విషవృక్షలతాకంటకమయమగుటచే నీమార్గమున నడచుట మాబోంట్లకే అతికష్టము. ఇఁక నీవిషయము వేఱె చెప్పవలయునా? కావున నేఁ జూపినచోట నడుగిడుచు కడు జాగరూకతతో రావలయును. భద్రముసుమా! (నడచుచుందురు. ఒకచో ఆగి వ్రేలితోఁ జూపుచు)

సీ. అతితరసూక్ష్మాగ్రమా కుశకంటకం
బిది మెల్లన నడుగు లిడఁగదమ్మ
వసుధాతలం బంట వంగిన దీకొమ్మ
వినమితమధ్యవై చనఁగదమ్మ
వామభాగంబున భయదగర్తము గాన
నీతరు వూతగా నెనయుమమ్మ
పండితస్వాంతంబువలె నొప్పు నీసమ
తలమునఁ గడువడి నడువుమమ్మ

గీ. అస్మదాశ్రమవాసిమహామునీంద్ర
బృందనిరతావగాహపావితజలప్ర
పూర్ణమీసరోవరమిందుఁ బుణ్యచరిత!
వేగ చరణసంశుద్ధిఁ గావించికొమ్మ.

సీత—(అట్లే చేయుచుఁ బోవును)

వాల్మీ—అమ్మా! జానకీ!

గీ. తొలుతనుండియు నిక్ష్వాకుకులజులకు భ
ర్త్రిఁ బుంసవనాదికక్రియ లవెల్ల
బ్రాహ్మణులకు మావలనను పొలఁతిమిన్న!
కాన గర్భశోకము మని మానుమమ్మ.

మఱియు—

గీ. తరుణి! కోసలాధిపసుతాచరణనలిన
యుగలసేవాసుఖముఁ గను మొనర వృద్ధ
తాపసీజనమందునఁ, దనర మునిసు
తలను జెలులు చెల్లెండ్రుగాఁ దలఁపు మెపుడు.

(అందఱు నిష్క్రమింతురు)

---

# కుందమాల

## ద్వితీయాంకము

(ఇరువురు మునికన్యలు ప్రవేశింతురు)

మొదటిది—సఖీ! వేదవతీ! మన నెచ్చెలియగు సీతకు రామునివలెనే శ్యామవర్ణులగు నిరువురు కొమరుల నుదయించిరి వింటివా?

వేద—అలాగా? సంతసము. వారిపేరేమి?

మొద—పెద్దవానికి కుశుఁడనియు చిన్నవానికి లవుఁడనియు వాల్మీకియే నామకరణ మొనరించినాఁడు.

వేద—చెలీ! వారేమైన నడువఁగలరా?

మొద—నడువఁగలరా! వినుము,

గీ. హరిణశాబకముల వెంట నంటి పరుగు
లిడి యొడిసి పట్టి కూల్చుచుం డ్రెపుడు ఫాల
తలమున స్స్వేదము 'మునికాంతా ప్రమోద
బాష్పబిందువు లేకమై వసుధఁ బాఱు.

వేయేల? వారిని తొడలపై కూర్చుండబెట్టుకొనని ముని యొకఁడైన గలఁడా? ఇపుడు వారు వాల్మీకి విరచితమగు రామాయణమునుగూడ చదువుచున్నారు.

వేద—ఔరా! ఈవార్తచే సీత కృతపుణ్యయని తలంచెద.

మొద—సీత యొక్క పుణ్యములు త్వరలోనే ఫలింపం గలవు. అది యటులుండనిమ్ము. నైమిశవనవృత్తాంత మేమి?

వేద—శ్రీరాముని యజ్ఞసంభార మంతయు సిద్ధము గావింప బడినది. ఋషులెల్లరు తమతమ పరివారములతో విచ్చేసి యున్నారు.

మొద—మన వాల్మీకి మహర్షికిఁగూడ పిలుపు వచ్చినదా?

వేద—ఇప్పుడే రామదూత వాల్మీక్యాశ్రమమునకు వచ్చెనని వినియుంటిని. నీ వెఱుంగవా? సీత యిపు డెచట నుండును?

మొద—ఇచటనే సమీపమున శీతలమగు నొక లేతమామిడి చెట్టునీడం గూర్చుండి యుండగలదు. నిన్నచటికి తీసికొని పోయెద రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశకము)

(సీత చింతాక్రాంతయై వట్టినేలపై గూర్చుండియుండును)

సీత—(నిట్టూర్పు పుచ్చి) అక్కటా! స్వభావనిష్ఠురములగు
పురుషహృదయములయందు బ్రహ్మదేవు డెంతటి అవిశ్వాస
నీయత్వమును పొందుపఱచియున్నాడు. అచంచలమై
ఆదర్శప్రాయమగు అన్యోన్యప్రేమ గల దంపతులలో స్వర్గ
మున ఉమామహేశ్వరులు భూలోకమున సీతారాములే
అగ్రగణ్యులని ప్రసిద్ధి నొంది తుదకు నపరాధము లేక
యిట్టి నీచాతినీచమగు నవస్థ ననుభవించుచుంటినే! ఎంత
కష్ట మెంతకష్టము! నానాథు నెట్లు నిందింపుదాన?
భర్తృనింద పరమదూష్యముగదా! ఇట్లు మున్నార్య
పుత్రునిచే..... ప్రస్తుతము బహుయోజనాంతరితమైన
యీయుగ్రారణ్యమున....... అకారణముగా..........
పూర్ణదుఃఖకారిణి నయితిని. మున్నార్యపుత్రునితోఁ గలిసి
శరచ్చంద్రచంద్రికావిభవమును జూచితిని. కోకిలకులకల
కలధ్వనుల వింటిని. మలయమారుత సుఖస్పర్శ మనుభ
వించితిని. కాని నేఁడు ఏకాకినినై ఈయుగ్రారణ్యమున...
చూచుచుంటిని, వినుచుంటిని, అనుభవించుచుంటిని.
ప్రాణములను త్యజింతు నని తలంచినను నాబోటిస్త్రీల
కయ్యది అసంభావ్యముగదా? పూర్వము సకలమిథిలాజన
ప్రార్థనీయనై వన్నె గాంచి మఱల నేఁ డిట్టి హీనదశ
నొందుటకు దైవమా! నే నేమి పాపము లొనరించితిని?
అది యటుండ సీతను మగఁ డడవులలో విడిచిపుచ్చె నను
దుఃఖముకంటె లజ్జ నాసర్వావయవములను దహించివైచు

చున్నది. ఏమి యీవిపరీతము? (దుఃఖము నాపుకొనుచు) అవక్రపరాక్రమసంపన్నులగు తనయు లిరువు రుదయించి క్రమక్రమముగ వృద్ధి నొందుచున్నారు. వాల్మీకియో న న్నత్యాదరముగ కన్నతండ్రికంటె నెక్కువగా చూచు చున్నాడు. తపోవననివాసవిరుద్ధమగు నీదీర్ఘశోకముతో కాలయాపనము సేయుట అసంగతము. కాన మరణ ప్రయత్నము నింతటితో విరమించికొనెద. అక్కటా! ఎంతవిస్మృతమతిని! నాప్రియసఖియగు వేదవతికి సుతజనన వార్త నెఱిగింపకుంటయేగాక జాతకర్మాదు లొనరించు సమయమున నైన బిలువనంపకుంటినే!

(వేదవతి ప్రవేశించును)

వేద—అక్కటా! ఈమె నిరంతరచింతానలదందహ్యమాన మానసయై మోము వ్రాల్చి అతిదీర్ఘములైనను చిక్కు-వడినముంగురులచే నేత్రద్వయము నాచ్ఛాదితమైపోవ మూర్తీభవించినశోకమో యన గానవచ్చుచున్నది. ఈమె శోక మంతరించుట కింక నెంతకాలము పట్టునోగదా! పలుకరించి కొంచెమూరడిల జేసెద. (సమీపించి) సఖీ! జానకీ!

సీత—(అదరిపడి చూచి) సంతసము సంతసము. చెలీ వేదవతీ! వచ్చితివా! కుశలమా?

వేద—కుశలవ్రులు సేమమా ?

సీత—ఆ. వనవాసులవలె.

వేద—నీవు కుశలమా ?

సీత—(జడను చూపి) ఈజడ యెట్లున్నదో చూచితివా?

వేద—జానకీ! నీయందపేక్ష యిసుమంతయు లేని కఠోర హృదయుఁడగు నారామునికొఱకు బహుళపక్షమందలి చంద్రలేఖవలె నిస్తేజ మగుదినము కృశింతువు ? ధీరస్వాంతల కిది తగునా?

సీత—ఏమి ! నానాథుఁడు కఠోరహృదయుఁడా ?

వేద—కాఁడా ! ఏదోషమును లేకయే నిన్నాతఁడు అడవులలో విడువలేదా ?

సీత—నన్నాతఁడు విడచెననియా నీయుద్దేశము ?

వేద—ఏమో లోక మట్లనుకొనుచున్నది. నిజముకూడ నంతియే.

సీత—శరీరముచేమాత్రమెగాని హృదయముచేగాదు.

వేద—అలాగా ! ఇతరులహృదయము నీవెటు లెఱుంగఁగలవు ?

సీత— ఆతనిహృదయము నె నెఱుంగనదియా ? సఖీ ! అతఁడు నాపై ననురాగమును త్యజించె ననుకొంటివాయేమి ? అటు లెన్నఁడును గాఁజాలదు. మందభాగ్యనగు నాకై పడరాని యిడుమలం బడి యాధరాధిపుఁడు మున్ను శతయోజనవిస్తీర్ణమగు సముద్రముపై సేతువు నిర్మించియుండలేదా ? అప్పుడైన నవ్వానికి నాపైఁగల యనురాగము వెల్లడికాలేదా ? ఏమి నీమరూపా !

వేద—పిచ్చిదానా! ఇంత తెలియనిదానవు కావుననే నీకిట్టి కష్టములు సంభవించుచున్నవి. శత్రువగు రావణునిపై కోపముం బట్టి మనస్సాధ్యములగు పనులకు బూనుకొనెనుగాని యింతయు సీతపై ననురాగమే కాదుసుమా.

సీత—మఱొక విషయము కూడ కలదు. నీ వది విచారించుట లేదు కాబోలు.

వేద—అది యెయ్యది?

సీత—సకలజననిశ్వాసానుపవిష్టమగు రాముని వక్షఃస్థలమున నేను చిరకాల ముపలాలితనై యుంటిని.

వేద—సఖీ! అట్టిభ్రమ లందకుము. రాముని యజ్ఞదీక్షాసమయముకూడ సమీపించినది.

సీత—సమీపించిన... ...

వేద—ఆతండు తప్పక సహధర్మచారిణీపాణిగ్రహణము చేయవలయును. భార్య లేనిచో యజ్ఞము నిరర్థకమని నీ వెఱింగినదే కదా!

సీత—ఆర్యపుత్రుని హృదయము ఇతరస్త్రీపాణిగ్రహణమున కిష్టపడునని నేను స్వప్నమందైనను తలంపను.

వేద—పోనిమ్మా. సఖీ! సుకుమారులగు కుమారుల ముఖారవిందమును జూచుచున్నను నీశోక ముపశమించుట లేదేల?

సీత—వేదవతీ! శోకము నాపుకొనుటకై ప్రయత్నము చేసినకొలంది అధికమై పోవుచున్నది.

వేద—ఎట్లు?

సీత—అమ్మా తనయు లిరువురును వచ్చియు రాని దంత ములుగల తమముఖకమలముల నెత్తి,చిగురుటాకులంబోలు చిన్ని చేతులతో నాచేతులు పట్టుకొని మనోహరముగా నవ్వునపుడును, అతిమృదుమధురమై శ్రవణపేయమగు నాలాపముతో ఏమియో నాతో మాటాడునపుడును చెలీ! ఆమహాభాగ్యమున నేనును ముగ్ధనై శోకమును మఱచు చుంటినిగాని యిపుడు మరల కాలవశమున నా సుకు మారు లిరువురు పరిణతులై బాలభావమును వదలి పెరుగుచుండుట జూడ నాహృదయ మంతయు శోకావేగ మున బ్రద్ద లగుచున్నది.

వేద—సాక్షాత్త్రిలోకమాతయు జనకుని తనయయు నగునిన్నీ భయంకరారణ్యముల నిట్టి యిడుములపాల్జేసిన ఆ రాముని నిష్ఠురత్వము నేమనవచ్చును ?

సీత—కాని యిపుడు... (సిగ్గొందును)

వేద—సిగ్గెదవేల? చెప్పుము ఆర్యపుత్రుని జూడవలయునని-

సీత—నిజమే, సిగ్గుతో పని యేమి ? సఖీ ! కుశలవుల తండ్రి నొకమాఱు చూచిన నాజన్మ సార్థక మగునని తలంచెద.

వేద—సఖీ! తొందరపడకుము. రాజసందర్శనకాలము సమీ పించియే యున్నది.

సీత—ఎట్లు ?

(నేపథ్యమున)

ఆశ్రమవాసులారా! వినుఁడు----

ఇచటికి కనతిదూరమున అశ్వమేధము జరుగుచున్నది. యజ్ఞోపకరణము లన్నియు సిద్ధము గావింపబడినవి. నానా దేశాశ్రమనివాసులగు వసిష్ఠాత్రేయాది ఋషు లెల్లరు విచ్చేసియున్నారు. కాని వాల్మీకి మహర్షి యింతదనుక రానికారణమున మహారాజు యజ్ఞదీక్ష గైకొనక ఆ మహర్షియొక్క రాక కెదురుచూచుచున్నాఁడు. వాల్మీక్యాశ్రమమునకు రామదూత కూడ వచ్చియున్నాఁడు గదా! ఇఁక నాలస్య మొనర్పకుఁడు,

తే. సకల తీర్థోదకంబుల, సమిధల, నవ
కోమల కుశాంకురంబులఁ గొని రయంబ
రండు మునులార! ఆశ్రమ ప్రాంగణముల
సరస వలు లమర్పుఁడు ఋషిజాతలార!

సీత—ఓహో! ఈ ప్రస్థానఘోషణమువలన కాశ్యపుఁడును యజ్ఞవస్తువులు దీసికొని అశ్వమేధమునకు ప్రయాణమై పోవుచున్నాఁడు. నేనును సత్వరముగా బోయి కుశలవుల ప్రయాణము సాగించెద.

(అందఱు నిష్క్రమింతురు)

# కుంద మాల

## తృతీయాంకము

(ఒక బహుప్రయాణముతో అలసిన ఒక ముని ప్రవేశించును.)

ముని—(చతికిలబడి ఆయాసపడుచు) అయ్యో! భరింపరాని యెండవేడిమిచే నాయొడలంతయు సొమ్మసిల్లినది. చెమటచే కట్టుగుడ్డలుగూడ తడిసిముద్దయైపోయినవి. అంత కంతకు ఆయాసము మిక్కుటమగుచున్నది. దీర్ఘ ప్రయాణముచే వాచి బరువెక్కిన నాకాళ్ళిక నాత్రోవ వచ్చునట్లు లేవు. అఱకాళ్ళనిండ స్ఫోటకపు బొబ్బలే. నాపని యిటులుండ సుకుమారాకారులును బాలురును అగు కుశలవులతో అబలయగు సీత సూర్యాస్తమయము కాకమునుపే నైమిశారణ్యమును జేరినదట. నేనో యింత దనుక ఆ నైమిశారణ్యము వైపునకే చేరలేదు. (ఇటునటు చూచుచు) ఇచటినుండి నాకు నైమిశారణ్యపుత్రోవ జూపువా రెవరు? ఒకపిట్టయయిన నగపడుటలేదే (ఒకచో దృష్టినిల్పి) అదిగో, రామలక్ష్మణు లిరువురు నిపుడే నైమిశమును జేరబోవుచున్నారు. నేనును వారి త్రోవ ననుసరించెద. (నిష్క్రమించును)

(ఇది ప్రవేశకము)

---

(విచారముతో రాముఁడు ప్రవేశించును)

(రామునివెనుక లక్ష్మణుఁడు వచ్చును)

**లక్ష్మ**—అగ్రజా ! అగ్రజా ! ఇది గాదు. ఈత్రోవకు రమ్ము.

రాము—(పలుకక తనదారినే పోవుచుండును.)

లక్ష్మ—అక్కటా ! నాయగ్రజునకు శోకాతిశయముచే బుద్ధిమాంద్యముకూడ సంభవించినది. నాపిలుపు ఆతనికి వినఁబడుటలేదు. ఏమి చేయుదు ? దైవమా ! ఈవిషమస్థితులన్నియు నామీఁదుగా జరుగుటకు మున్నెంతపాపమొనరించియుంటినోగదా !

చ. అరిగితి మున్న ఘోరవిపినాంతరమున్ దకృతాపరాధ యౌ
ధరణిజ డింప మౌనివనితాజనదర్శనకైతవాన, ని
త్తఱి రవివంశశేఖరుని దాశరథిం గొనిపోవుచుంటి నే
నెఱుఁగఁగరాని తాపమునకు నిట్లు నిజాన్వయఘాతకుండనై.

ఆహా ! మహాత్ములు వచించిన వాక్యము లసత్యములా ?

క. అరయఁగ సలసత ధనముల,
గరువము ప్రణయంబు, వ్యసనకాంక్ష వినయముల్,
నిరుపమశోకము ధీరత,
సరగున నశియింపఁజేయు క్ష్మావలయమునన్

మందరగిరిధీరుఁడగు నాయగ్రజుఁడు వాల్మీక్యాగమనము నాలించి తద్దర్శనార్థమై గోమతీతీరమందలి ఆశ్రమమును జేరఁబోవుచు నిపుడు శోకాతిశయమున నొడలు మఱచి సరియగు మార్గము వదలి పిచ్చివానివలె ఆభయంకరారణ్య

మునకుఁ బరుగిడిపోవుచున్నాఁడు. ఇఁక నతని నెట్లు స్వస్థుని గావింపఁగలవాఁడ? ఎట్లు నీవు త్రోవ తప్పి పరుగిడుచుంటివని తెలుపఁగలవాఁడ? అయినను నింకొకమాఱు గట్టిగా పిలచి చూచెద.........అగ్రజా! అగ్రజా! ఇటు రమ్మా.

రాము—(పలుకకయే ఆగి నిట్టూర్పు విడచి)

సీ. పర్వతావళితోడ వారాశిపై సేతు
నిర్మాణకష్టంబు నేలఁ గలిపి
లోకకంటకుఁడగు కైకసీసుతు నెది
రించి చంపిన శ్రమ రిత్తజేసి
అకలుషభక్తి నన్ననయ మర్చించిన
యరుణనందనుసాయ మగ్గి వైచి
సాధుభావమునకై సాక్ష్య మొసఁగిన
యనలదేవుని పల్కు వ్యర్థపఱచి

గీ. అకట! ఇక్ష్వాకుకులభూధవాంకురంబు
నైనఁ గనక మోహాంధత నవనిదుహితఁ
బెండ్లియాడినదాది నేడ్పించి తుదకు
నడవిపా ల్సేసి తిట్టులు జడుఁడ నగుచు.

(పరిక్రమించి) అసహాయ మగు వనవాస మెంతకష్టము! ఎంతఘోరము!

చ. ఏరమణీయవస్తువుపయిం దననేత్రయుగంబు నుంచి వి
స్తారముదంబు నందు, మదిఁ దాపము వాయును దేనిఁ గోరి,

నతీరున నాస లేకయును దేహముధారణసేయు వ్యాఘ్రసం
చారపరీతమౌ భయదసాంద్రవనాంతరసీమ సీత తాఁ?

లక్ష్మ—ఈతనికి శోక మంతకంత కధికమగుచున్నది. ఉపేక్షిం
చిన నేమి ముప్పు వాటిల్లునో? సమీపించి ప్రస్తావాంత
రముచే కొంచెము శాంతింపజేసెద (సమీపించి) అగ్రజా!
ఈగోమతీనది యెంత మనోహరముగా నున్నదో చూచి
తివా?

చ. వి[illegible] త్త్వుత్థ కుసుమమున్ సలిలంబులు రాజిలన్ మనో
హారిలస[illegible]సికతాకులకలాపవరమ్యతటప్రదేశమై
సరసిజసౌరభోల్లసితసర్వదిశావలయంబునై ప్రభాకరకుల
రత్న! అల్లదిగో కాంచితె? జాహ్నవి చెన్ను మీఱెడిన్.

రాము—(స్పర్శ మభినయించి)

మ. కలికిం బాసిననాఁటఁగోలె నను ముక్తాహారముల్ దక్షిణా
నిలుఁడుం జందన మింపుపాదములు నెంతేతప్తునిం జేసె నేఁ
డెలమిన్ మోదముఁ గూర్చుచున్నయది కంటే గోమతీతీర
శీతలమందానిల, ముందు నే తలఁప సీతాసాధ్వితా నాదెసన్

లక్ష్మ—ఈగోమతీప్రపాత మతివిషమముగా నున్నది. కాన
నేమంగడు జాగరూకతతో దిగవలయును సుమా!

(ఇరువురు నట్లే చేయుదురు)

లక్ష్మ—(నేలపై నలువైపుల పరిశీలించి చూచి) ఈ ఇసుక
తిన్నెపై మనుష్యపదచిహ్నము లధికముగా కన్పట్టు
చున్నవి. ఈపూతీగెలయందు నయితము పూవులు లేని

తొండిమెలు దట్టములుగా నుండి నవగ్రములయందు రస మింకను స్రవింపుచుండుటఁ జూడ నిప్పుడే కొందఱు లతాంగు లెవరో పూవులు కోసికొనిపోయినట్లు తోచుచున్నది. తదాలవాలనకిసలయభరితములగుట తీరభూరుహములు విరలచ్ఛాయాయుతములై యలరారుచున్నవి. వేయేల? ఈప్రాంతమును బాగుగ పరిశీలించి చూడ ఇచటి కనతిదూరముననే మనుష్యులు నివసించుచున్నట్టులున్నది. (కొంతదూర మేగి ఒకచో పరిశీలించి చూచి) శరచ్చంద్రచంద్రికాధవళములగు నీ వాలుకాతలములం దెవరో మహనీయులు దేవతాపూజయు సలిపియున్నారు. అందు ఈ పూవులును కేసుగంధక సుగంధమును వెలిజిమ్ముచున్నవి. ఇది చూడ ఈపూజయు నిప్పుడే జరిగినట్లున్నది. (నదీజలమును సమీపించి చూచి)

గీ. రహిఁ జెలఁగ నద స్తటిసితరంగమాలి
కలలొ రుచిరలలితకలావిలసనముల
సలుపుచు సురగాంగనవలెఁ బొలుపుమీఱు
కుందమాలఁ గంటివె యినకులవతంస!

రాము—కేవలము మనుష్యులు సమీపమున వసించుటయే గాక వారిపుడే ఈగోమతీతీరమునకు వచ్చిపోయియుందురు.

లక్ష్మ—ఏమి యీయాశ్చర్యము! సముద్రగామినియగు నీ గోమతీతరంగజాలము శ్రీరాముని చరణారవిందము నర్చిం

చటకు వైరాత్రే క్రమముగా నీకుందమాల నాతని చరణార
విందములను మెలివైచుచున్నది. (చేతితో మాలను తీసి)
అగ్రజా! ఈమాలారచన యెంతమనోహరముగానున్నదో
చూచితివా?

రాము—(పరీక్షించి చూచి) లక్ష్మణా! ఈమాలారచనా
కౌశలమును మున్ను చూచినట్లున్నది.

లక్ష్మ—ఎచట చూచియుంటివి?

రాము—స్ఫురించుటలేదుగాని చిరపరిచితమే యయినట్లు
మాత్రము తోచుచున్నది.

లక్ష్మ—చిరపరిచితమయిన......మావదినెగారిదియందా?

రాము—ఆ. అయియుండవచ్చును.

లక్ష్మ—(ఇంచుక విచారించి) అట్లులయిన ఈ అడుగులజాడం
బడి గోమతీతీరము ననుసరించి పోయి యీకుందమాలా
విషయమును తెలిసికొందము. రమ్ము పోదము.

రాము—లక్ష్మణా! లోకమున ఒకవస్తువును పోలిన వస్తువు
లనేకము లుండగలవు. ఈకుందమాల కనుపడినంతమాత్ర
మున మన మదృష్టవంతులము కాముసుమా. భయంకర
మగు నరణ్యమధ్యమున పరిత్యజింపబడిన సీత యీగోమతీ
తీరభూముల కేతెంచియుండుననుదువా? కల్ల! ఏల యీ
పిచ్చిఆశలు? ఈమాల నెవరో నేర్పరులు తయారుచేసి
యుందురు. అయినను ఈసలిలాంతరమును విడువ కరిగి
అరసి చూచెదముగాక. నడువుము.

లక్ష్మ—ఈనదీప్రపాతమున కంటకప్రాయమగుటయేగాక శుక్తి ఖండమిళిత మగుటవలన నాలుకాలలును నడచుటకతికష్ట ముగా నున్నది. అయినను చే చూపిన త్రోవను మెల్ల మెల్లగా రావలయునుసుమా.

రాము—అట్లే వచ్చెద. కాని యీకుందమాల అత్యంతమనో హారముగా నున్నను దేవతోపహారముగా నొసంగఁబడి యుండనుగాన ఇచటనే విడిచివైచెద. (కుందమాల నచ టనే వదలివైచును.)

(ఇరువురు పోవుచుందురు)

లక్ష్మ—(త్రోవలో వ్రేలితో చూపుచు)

మ. పొడవౌ వేత్రమతిక్రమింపు, మివిగో స్ఫోటాదిఖండంబు లీ
డడగు ల్మోపకు, దూరనమ్రతరు వీడం బొమ్ము నమ్రోత్త
మాంగుఁడవై, యావల కొత్తుమీ యెదుట నీకొమ్మఁ గా
శరాగ్రంబుచే, జడియుఁ గా హింస్రసతీచయంబు చను మీ
జాడం గనుఁ గా క్షీరతఁ గా.

రాము—(అట్లేకావించి) లక్ష్మణా! ఈప్రాంతముననే వాల్మీ క్యాశ్రమ మున్నదా యేమి?

లక్ష్మ—చిహ్నము లేమైన నగుపడుచున్నవా?

రాము—చూడుము—

గీ. తద్దయుఁ గా సూక్ష్మమై యవధానదర్శ
నీయమౌ హోమధూమంబు నింగి కెగసి
క్రమ్మివైచుచునున్నది చిమ్మరేగి
ఆడ నలుదెసల్, కాంచితె మ్రోల ననుజ!

అంతియగాక—

క. అవిరళగతి జనియు మే
ళవింపఁగా దొడఁగె నిదియె లక్ష్మణ! మృదుగం
ధవహానీతంబయి శ్రవ
ణవివరములలోన సామగానం బలరెన్.

లక్ష్మ — బాగుగా వినిపించుచున్నది. నేను నిక్క కొంత ముందున కేగి పరీక్షించెదను. (కొంతముందొక వృక్షసంఘముచెంత కేగి) ఆహా! ఏమిది! ఇక నడుగులు వైచుటకు నాకోపము జనియుచున్నదేల! తొడలు స్తంభించిపోయినవే. ఎంత ప్రయత్నము చేసినను అడుగులు పైకి లేవనేరకున్నవి. ఎందు వలన నయియుండవచ్చును! (విచారించి) ఈప్రదేశము గదు జనసమాక్రాంతమై యుండనోపు. ఇవిగో ఈయిసుకపై వారిఅడుగులుగూడ కన్పడుచున్నవి. (నేలపై పరిశీలించి చూచును.)

రాము — లక్ష్మణా! అచట నంతగా పరిశీలించుచుంటి వేమది?

లక్ష్మ — అగ్రజా! అతిమనోహరములగుకతన సంక్రాంతచరణా లక్తలసాకుమార్యభాసురములగు పదచిహ్నములు లీపులిన తలమున కనులపండువు సేయుచున్నవి. చూడఁగా లలిత నిభృతపదవిన్యాససహితంబులగుకతన నివి అనన్యవనితాజన సామాన్యలావణ్యయగు నొక మహిళారత్నముయొక్క సుందరచరణారవిందద్వయచిహ్నములై యుండునని తోచు చున్నది. చూడుము—

చెంత సుఖ మనుభవింప నోచుకొననైతిని. త్రిజగత్పావనీ! భాగీరథీ! అనుదినము స్వహస్తగ్రథితమగు కుందమాలతో ము న్నినతీరున నర్చించుచునే యుంటినిగదా! ఇప్పటికైన నను గరుణించి నానాథునిదర్శన మబ్బునట్లనుగ్రహింపవా? కానిమ్ము, అకలుషమగు భక్తిభావమున ని న్నర్చించుచుంటినేని నానాథుఁడు స్వయముగ నాకై యీవాల్మీక్యాశ్రమమునకు లక్ష్మణునితోగూడ రాకుండునా! ఏల ఈవిచారము? (ఒడిలో పూవులు గోయుచుండును.)

(రాముఁడు, లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

లక్ష్మ—అగ్రజా! ఈ అడుగులజాడ రానురాను యిసుకనేల నుండి యీకఠినతలమున కరుదెంచినది. కాన యేడజూచి నను గానవచ్చుటలేదు. కావున ఈముంగల కనంబడుచున్న పూదోటలో నించుక విశ్రమించి శ్రమ వాపికొని పిదప వాల్మీకిదర్శనమునకు ప్రయాణము సాగించుట సమంజసమని నాయూహ. ఏమి నీయభిమతము?

రాము—అలాగే కానిమ్ము.

(పూదోటలో జేరి ఇరువురును కొంచెము కొంచెము దూరముగ కూర్చుందురు)

రాము—(తొందరతో) లక్ష్మణా! లక్ష్మణా!

సీత—(చెవి యొగ్గి ఆశ్చర్యముతో) ఏమిది? సజలజలధరారావగంభీరమగు కంఠస్వరమున నతిశోకవిధురమై యున్న

నాశరీరము నకస్మాత్తుగా పులకితము గావించుచున్న యీ
మహనీయుఁ డెవఁడై యుండునో! పరిశీలించి చూచెద
గాక. (మఱల సంకోచముతో) వాస్తవము నెఱుంగ
కేకాంతమున నిట్లన్యులపై దృష్టి బఱపుటయు సమంజసము
గాదు. కాన అతఁ డెవరో కనుఁగొందునా? లేక నాకృత్యము
నెఱవేర్చుకొనుచు నూరకుందునా? ఇప్పుడు నే నేమి
చేయవలయును? అది యటుండ ఇతఁడు నాకు పరిచితుఁడై
పరపురుషుఁ డగు నేని యీతనికంత స్వరము నాకు మనో
వికారమును గలిగింపగలుగునా? ఒకవేళ ఆ అదయ
హృదయుఁ డిట కేతెంచెనా యేమి? చూచెదగాక. పరా
ఙ్ముఖుఁడగు వ్యక్తిపై లేనిపోని యుబలాటమున నే
నిట్లు తొందరపడు టొకింత లజ్జాస్పద మగునేమో?
ఇంతయేల? అత డెవఁడైన నేమి? నే నేల వానిం దెలిసి
కొనవలయును? ఆవైపునకు ముఖ మైనను ద్రిప్పక నా
కర్తవ్యము నొనరించుకొనియెద. (ఆవలకు దిరిగి పూవులు
కోయుచు మఱల నాపి వైచి) అక్కటా! ఏమి చేయుదు?
బలాత్కారముగా నాదృష్టి యావైపునకే లాగివేయఁ
బడుచున్నది. ఇఁక నాతనివృత్తాంతమును దెలిసికొనక
నిముసమైన నిలువఁజాల. (నలువైపుల వెదకి చూచి
సంతోషముతో) ఆహా! నే నెంతధన్యనైతిని! నానోము
లన్నియు ఫలించినవి. పరమపావనియగు గంగాభవాని
నాపై నెట్టి నిర్వ్యాజకరుణ బూనినది! మనోవిభుఁడు
కంటి కగుపడెనను సంతసము, చిరకాలవియోగమును

కోపము, కృశించెనను చింత, కఠినుఁడను నభిమానము, చిరపరిచితుఁడని యనురాగము, దర్శనీయస్వరూపుఁడని యుల్లాసము, నాథుఁడని సన్మానము, కుశలవులతండ్రియని కుటుంబినీసద్భావము, అకారణముగ దండింపఁబడితినని లజ్జ, ఆహా! మనోహరుఁ డగుపడినంతమాత్రమున నా హృదయమునం దెన్ని యూహలు పొడమినవి?

లక్ష్మ—(తొట్రుపాటుతో) ఏమి యాజ్ఞ?

రాము—లక్ష్మణా! మనుష్యసంచారరహితంబును, గహనతరు లతాగుల్మగుల్మినీసాంద్రంబునగు నీమహారణ్యమును, తట రుహబహువిధవిటపివిటపచ్ఛాయాసమాచ్ఛాదితపులినతట మ్మును, విమలసలిలప్రవాహభాసురంబును నగుగంగాతరం గిణిని గనుంగొని నాటి వనవాస మంతయు గనుల కగు పడ హృదయ మదరినదోయి.

సీత—(దూరమున నుండియే) కేవలవనవాసమేగాని వనవాస క్లేశ మనుభవించుచున్నవారలుమాత్రము జ్ఞాపకమునకు రా లేదుగా బోలు.

రాము—తమ్ముఁడా! ఏమంటివి? దుఃఖైకవాసమగు వనవాస మున స్మరింపఁ దగువస్తువనియా? స్మరింపకేమోయి? వినుము—

చ. సరసవచఃకలారచనచాతురి మీఱ ధరాతనూజసుం
దరకరపల్లవం బతిముదంబునఁ బట్టి సవేగపాదసం

చరణవినిస్సృతాంబువులు సౌఖ్యముఁ గూర్ప స్మరింపు చుంటి సోదర! దివసావసానసికతాతలమంథరచంక్రమం బెదఁ.

సీత—అదయహృదయా! ఈసల్లాపముచే దిక్కు లేక వనమున పడరానిపాట్లు పడుచున్న యీదీనురాలిని మఱింత పీడింతువేల?

లక్ష్మ—అగ్రజా! విచారము నందకుము.

రాము—ఇట్లు చేతకానివాఁడనై విచారింపక, విలపింపక, మఱేమి చేయఁగలను?

గీ. ప్రథమమున వనవాస మాపైని లంక
మఱల నీదుస్సహావియోగ మరయ ధరణి
తనయ నిర్భాగ్యుఁడనగు నన్ తగ వరించి
పడుచునున్నది పడరాని పాటు లెన్నొ.

సీత—స్వయముగా నడవుల కంపి యిట్లు విలపింపఁదగునా?

రాము—హా! జనకరాజపుత్రి!

సీత—కావుననే కనుల కగుపడకుండ దూరానఁ బారవైచి...

రాము—హా! వనవాససహాయినీ!

సీత—ప్రస్తుతము కాదుగదా?

రాము—హా! ప్రాణసఖీ! ఎం దేగితివి?

సీత—అబల ఎచటి కేఁగఁగలదు?

రాము—మాఱాడవేల? మధురములగు నీవాక్సుధాధారలచే నాదుఃఖాగ్నుల మార్పఁజనదా? సీతా! పలుకవేల? రమ్ము. నాకన్నుల కొకమాఱు దర్శన మిమ్ము. (శోకించును)

సీత—అసంభావనీయునితో నేల మాఱాడవలయును ?

లక్ష్మ—అగ్రజా! శోకమును మానవా? ధీరపురుషుల కిది న్యాయమా?

రాము—లక్ష్మణా! సీతకై విలపింపక యూరకుండగలనా?

సీత—సీతకై విలపింపవలయు ననుచుంటివా? అట్లనకుము. ప్రియునిచే నెల్లపుడు నేడ్పింపఁబడువారలకై శోకింపవలయునుగూడనా?

రాము—సౌమిత్రీ! సీత యెచట నున్నదో తెలిసికొనగలవా?

సీత—దివసావసానవినివారితసమాగమ మైయొంటి దిరుగు చక్రవాకాంగనవోలె ప్రవాసవ్యథ ననుభవించుచు ఇచటనే యున్నది.

లక్ష్మ—తెలిసికొనుట మిక్కిలి కష్టము.

రాము—పూర్వమునుండియు నవిచ్ఛిన్నముగా వచ్చుచున్న ఈ రఘుకులమును నేఁడు సంపూర్ణము గావించి వైచితిని గదా! (విచారపడును)

సీత—నామనోహరునకు శోక మంతకంత కధిక మగుచున్నది. ఇక నే నేమి చేయగలదాన? సాహసించి కనుకొలంకుల

నుండి కాల్వాలై కారుకన్నిటిని నాచేలాంపలనుచేతుసిచి వైతునా? (ఒక యమగు నైచి) అట్లుచేయుట తప్పిద మగునేమో? జనాపవాదమునుండి కాపాడుకొనవల యునుగదా? కావున ఆర్యపుత్రుండు నన్నుచూచి గురు తించునంతవఱకు తొందరపడకుండుటయె శ్రేయస్కరము. అది యటులుండ ఇచ్చట మును లనవరతము సంచరించుచుందురు. అట్టిచో నే నిచట నుండి వీరితో సంభా షించుచుండు టెమునీంద్రుఁడైన చూచి కోపించునేమో? అటులైన ముప్పు వాటిల్లఁగలదు. కావున వెంటనే ఆశ్ర మమున కరిగి కుశలవు లెటులుండిరో విచారించుకొని యెద. (చూచుచు నిష్క్రమించును)

(ఒక ఋషి ప్రవేశించును)

ఋషి—వాల్మీకియాజ్ఞప్రకారము ఎంత వెదకినను రామలక్ష్మ ణులు కనుపడకుండుటకు కారణ మేమై యుండును? నిజ ముగ వారు ఆశ్రమప్రాంతమునకు వచ్చిరో లేదో? రెండు జాములు కావచ్చుచున్నది. ఒకవేళ వారు వచ్చినది నిజ మేయైన అతిథి సత్కారములకు కాలముకూడ అతిక్ర మించిపోవుచున్నది. వారిజాడ తెలిసికొనక ఆశ్రమము నకు బోయిన వాల్మీకి యేమనునో? కానిమ్ము, మఱొక మాఱు వెదకి వారిం గలిసికొనియెద.

(నిష్క్రమించును)

లక్ష్మ—(చూచి) (తొందరతో) అగ్రజా! ఎవఁడో తపోధనుఁ
డొకఁడు మనవైపునకే వచ్చుచున్నటులున్నాఁడు. చూడుము

(రాముఁడు కన్నీటిం దుడుచుకొని ధైర్యమూని యుండును.)

(వెదకుచు ఋషి ప్రవేశించును.)

ఋషి—(పరికించి చూచి) ఈపూదోటలో నెవరో యిరువురు
పురుషు లున్నటులున్నారు. వీ రెవ్వరై యుందురు ?
రామలక్ష్మణులే యైనచో నాఅదృష్టమే. (పరిశీలించి
చూచి) ఇంకను సందేహమా ?

సీ. కన ఫుల్లసుమజాలగంధబంధురమై యొ
సఁగె మందపవనంబు స్పర్శసుఖము
ప్రబలనిదాఘోగ్రరశ్మిరశ్మిప్రభల్
శరదిందుచంద్రికాస్ఫురణ మెఱసె
మృగరాజములఁగూడి మెలఁగజొచ్చెను దమి
హరిణాంగనల్ మది వెఱపు దొఱఁగి
మధ్యాహ్నమైన గుల్మము దరికేగ దొ
య్యనఁ దదధ్యాసితంబైన ఛాయ

గీ. మాట లిఁక నేల యొక వేయి క్ష్మాతనూజ
కష్టములఁ దీర్పఁ గొమరులఁ గౌఁగిలింప
విడిసియున్నాఁడు వల్లరీవితతియందు
రామనామాఖ్యుఁడౌ పరబ్రహ్మమూర్తి.

కేవల మమానుషప్రభావవిభవమున నేగాక త్రిలోకమోహన మగు నాకారముచే నయిన నీతఁడా జానకీజానియే యనినా మనోనిశ్చయము. ఏలన—

గీ. సరసశాకేరకకరిముఁ డాజానుబాహుఁ
సుందరుం డున్నతుం డరవిందనయనుఁ
డతివిపులతరోరస్కుఁడు వితతయశుఁడు
సందియంబేల యితఁడు కౌసల్యకొమరుఁడె.

త్వరగా నీతనిపాలికిఁ బోయి నావచ్చినపని నెఱింగించెద. (సమీపించి) మిహిరకులమండనా! కల్యాణమగుఁగాక.

రాము—మునీంద్రా! నమస్కారము.

ఋషి—విజయమగు గాక.

రాము—మహాత్మా! మీ రిచటకు రాఁ గతం బేమి ?

ఋషి—రామచంద్రా! మాధ్యాహ్నికకృత్యము లన్నియు పరిసమాప్తి నొందించుకొని వాల్మీకిమౌని మీదర్శనమునకై ఆశ్రమమున వేచియున్నాఁడు.

రాము—(చూచి) లక్ష్మణా! అపరాహ్ణముసయిత ము[illegible] మించిపోయినది. చూడుము—

క. ద్రుమమూలాశ్రయరయసం
శమితప్రాహ్ణాతపోరుసంతాపములై
తమి నరుగఁ దొడఁగెఁ బాంథా
ఘములట్టులు చాయలెల్లఁ గాంచితె యనుజా!

అంతియగాక —

మ. కరఘాతాధికఘూర్ణమానఝరిణీకల్లోలమై శీకరా
కరకీర్ణానిలసేవితాననమునై కన్గొంటె మధ్యాహ్న భా
స్కరతాపంబు జలావగాహమున వేగం బో నురఃక్షుణ్ణనీ
రరయాక్రాంతతటాభిగామి యగుచున్ రాజిల్లు నీనాగము౯.

(అందఱు నిష్క్రమింతురు)

---

# కుంభమాల

## చతుర్థాంకము

(వేదవతి యజ్ఞవేది యను నిరువురు తాపసాంగనలు ప్రవేశింతురు)

వేద—సఖీ! యజ్ఞవేదీ! రామాయణగానమునకై స్వర్గలోకము నుండి మనవాల్మీక్యాశ్రమమునకు వచ్చిన తిలోత్తమ— నేను సీతరూపమును ధరించి రాముని సమీపమున కరిగి రామునికి సీతపై నెంత ప్రేమ కలదో పరీక్షింపవలయును. నీ వాతఁ డెచట నుండెనో తెలిసికొని నా కెఱిగింపుమని యింతకుఁబూర్వమే నాతో చెప్పియున్నది. ఆతఁ డెచట నుండెనో నీ వేమైన నెఱుఁగుదువా ?

యజ్ఞ—చెలీ! తిలోత్తమ నీకీవిషయమును చెప్పునప్పుడు అచటి కనతిదూరమునను న్న పొదమాటున డాఁగి యుండి రాముని స్నేహితుఁ డొకఁడు మీయిరువురిమాటలను విని యుండెను. అది నీ వెఱుఁగవు కాఁబోలు.

వేద—అలాగా! ఎంత మోసము జరిగినది! అట్లైన రామునకుకూడ యిదంతయు తెలిసియేయుండునుసుమా! ఒకవేళ తిలోత్తమ కపటసీతయై రాముని యెదుట నేమైన చేసిన హాస్యాస్పదము కాగలదు. కాన నేను త్వరగాబోయి

తిలోత్తమ కిదంతయు చెప్పి వచ్చెద. (పోఁబోవును)

యజ్ఞ—చెలీ! ఒక్క మాట. ప్రస్తుతము సీత యెచట నున్నది?

వేద—నేటి కొక వారమునుదినములక్రిందట నే తెంచిన తాపసోత్తములు—చక్రవర్తి యగు శ్రీరాముఁ డిచటి కతి సమీపమున నున్నాఁడు కాన పద్మములుగోయుటకుఁగాని స్నానాదులకుఁగాని పరపురుషులు చూచుచుండ స్త్రీలు ఈఆశ్రమసరోవరమున దిగుట మంచిదిగా దనిరి. అంత వాల్మీకి ఏమియో విచారించి తుదకు—ఈసరోవరమున నుండు స్త్రీలు పురుషుల కగుపడకుండునటుగా తమని యనుగ్రహించియున్నాఁడు. నాఁటినుండియు సీత రామునిదృష్టిలో బడక ఆసరోవరతీరమునందే దిన మంతయు గడపుచున్నది.

యజ్ఞ—కుశలవులు రామునికిని తమకును గల సంబంధ మేమైన తెలిసికొనిరా?

వేద—పుట్టినప్పటినుండి మునికుమారులతోనే కలిసియుండుట వారు తమతల్లిపేరే యెఱుఁగరు. ఇఁక ఎప్పుడో పుట్టక పూర్వమే వదలిపెట్టిన రాము నెట్లు తెలిసికొనగలరు?

యజ్ఞ—పోనీ! రాముఁడీ ఆశ్రమములోనికి వచ్చెనా?

వేద—అతఁ డేల వచ్చును?

యజ్ఞ—అవును. ఇక నీవు త్వరగా బోయి తిలోత్తమతో మాట్లాడి రమ్ము. నేనును సీతయొద్దకుఁ బోయి పరిస్థితు లన్నియు విచారించెద. (నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశకము)

(ఒకవస్త్రముచే శరీరమంతయు కప్పుకొని
సీత, యజ్ఞవేది ప్రవేశింతురు)

యజ్ఞ — జానకీ! ఈవస్త్రముచే శరీరమంతయు కప్పివేసికొనుమని నీ కెవరు బోధించిరి?

సీత — నా కెవరును బోధింపలేదు. ఈ సరోవరముపైనుండి వచ్చు వాయువు మిక్కిలి చల్లగా నుండి విపరీతముగా చలివేయుచుండుటచే నేనే కప్పుకొంటిని.

యజ్ఞ — అటులయిన ఇది ప్రవాసవిరుద్ధము కాదా?

సీత — నెచ్చెలీ! పూర్వము మేము దశరథునియాజ్ఞానుసారము వనవాసమునకు జని చిత్రకూటమున కొన్నిదినము లుండి అచటినుండి బయలుదేరి దక్షిణాపథమునకుఁ బోవ సిద్ధమయి యున్న సమయమున చిరనివాసనిబద్ధస్నేహ యగు మాయావతి యను వనదేవత నాఎడబాటున కోర్వక జ్ఞాపకచిహ్నముగా శరచ్చంద్రచంద్రికాధవళమును, మనోహరసుగంధసంభరితమును అగు నీ చీనాంశుకమును నా కొసఁగినది. ఇది మే మరణ్యమున నున్నంతకాలము మా యిరువురకి తోడునీడగా నున్నది. కాన యిచట కూడ ఆదరముతో ధరించితిని గాని వేఱొండుగాదు. కాని......

(అని దుఃఖము నొందును)

యజ్ఞ — అమ్మా! వగవకుము. ఈతపోవనవాసమును వనవాసముగా తలంపకుము.

సీత—సఖీ! నగవ కెట్లూరకుండగలను? ఆర్యపుత్రు డిచటి
వసియించెనుగదా యని ఆపుకొనుచుంటినిగాని దిక్కు లేక
మగనిచే విడువఁబడి దీర్ఘముగ తీక్ష్ణనిశ్శ్వాసములతో
రాత్రిందివములు గడపుచుంటినిగదా! హృదయవిదారక
మగు నీప్రవాసక్లేశమంతయు నొక్కమాఱుగా పైకుబికి
వచ్చుచున్నది.

యజ్ఞ—అవును. నీ వేమి చేయఁగలవు? ఎప్పుడైన నిట్టికష్ట
ములు వచ్చునని యనుకొంటివా? కాని సరోవరమున
నలరుచుండు విహంగములవిభ్రమాదికములం
జూచితివా?

సీత—(సరోవరమును జూచి) ఆహా! ఎన్నడును విరహ
మనున దెఱుంగని సమాగమసుఖ మనుభవించుచున్న
యీవిహంగదంపతు లెంతధన్యములోకదా! ఇవి లలిత
ములై మృదుమధురములై శ్రవణపేయములగు కలకల
ధ్వనులతో నొండొంటిహృదయము లపహరించుకొనుచు
చాటువాక్యములను గడించుచున్నవి.

యజ్ఞ—(ఒకచో దృష్టి నిల్పి) మహర్షు లెల్లఱు తొట్రు
పాటుతో తమతమ యాసనములపైనుండి లేచి గుంపుగా
పోవుచున్నారు. కారణ మేమై యుండనోపు? రామ
చంద్రుఁడే తెంచెనా యేమి? నే నిదే అచటికి బోయి
విషయము తెలిసికొని వచ్చెద. నీ విచటనే యుండుము.

(నిష్క్రమించును)

(చింతాక్రాంతుఁడై రాముఁడు ప్రవేశించును)

(వాని వెనుక మెల్లగా కణ్వుఁడు ప్రవేశించును)

కణ్వుఁడు—వాల్మీకియాజ్ఞచే నైమిశారణ్యరామణీయకము నంతయు జూపి సంతసింపఁజేయ నెంత ప్రయత్నించినను యీతఁడు నన్ను కన్నెత్తి చూడనైనఁ జూడఁడే. ఒక వైపునకు బోవుదమన్న పిచ్చివానివలె తా నొక వైపునకు బోవుచున్నాఁడు. మఱియు—

గీ. సమపథంబునయందైన స్ఖలనమొంది
వెనుకఁ బడుచుఁ గడు మందగమనము నెఱసి
ప్రేక్ష్యమై యొప్పు నైమిశవిపినభూమిఁ
గనఁ డొకింతేని యవనతాననుఁడు నగుచు.

(సమీపించి) సార్వభౌమా !

రాము—(వెనుకకు తిరిగి) మిత్రమా ! నే డేమో వింతగా బిలుచుచుంటివి. వయోవస్థాభేదముచే నట్లు పిలచితివి. కాకున్నచో బాల్యస్నేహితు లిట్లు పిలచుకొందురా ?

గీ. ఏను రాముఁడ, కణ్వుఁడ వీవు గాఁగ
వావిచేఁ బుచ్చితిమి శైశవంబు మున్ను
కాని యిపుడు వయోవృద్ధికతన మీర
లార్యులును, సార్వభౌముల మైతిమేము.

కణ్వు—అవును. వాస్తవము వచించితివి.

రాము—సరే. వీని కేమి ? నీవేదియో వచింపఁబూనినటు లున్నది. అదెయ్యది ?

కణ్వ—

చ. ఇక్ష్వాకుకులాబ్ధిచంద్రమ! యమేయబలాన్విత! ప్రేక్ష్య
రూప మీ గహనము మోదదంబగుచుం గ్రాలెనె ? సత్ఫ
లద్రుమశాఖలై బహువిధసూనసౌరభసువాసితసర్వదిగంత
కాంతభూరుహావలయాశ్రితలతరరూపసమీపతలంబునై కనన్

రాము—బహుమాననిరంతరీకృతమానసుండనగు నా కీవనము
మనోమోదదాయకమో కాదో వచించుట కిప్పు డవ
కాశము లేదు. చూడుము—

మ. క్రతుహోమాగ్నిమతిన్ దవానలుఁ దరువ్రాతంబు యూపా
స్థచేఁ బతదవ్యక్తరుతంబు సామనినదభ్రాంతిన్ మృగ
ప్రతతిం దాపసగౌరవంబునను సంభావించు చిక్కానన
క్షితిఁ బాదంబుల మోపుచుంటి నెటులో క్లేశంబు
వాటిల్లఁగన్.

కణ్వ—సకలలోకకళ్యాణార్థమై యవతరించిన మహనీయులకు
అకల్మషతపఃసిద్ధక్షేత్రమును పూర్వరాజర్షివంశనిషేవితం
బును అగు నీ నైమిశారణ్యముపై నిట్టి యవ్యాజగౌరవ
మనురూపమేగదా !

ఉ. ఏకధనుఃప్రభావమున నీజగతీవలయంబు గెల్చి యా
నాకముఁ జేర దివ్యయజనప్రచురంబుల మెట్లు వెట్టి యి
క్ష్వాకుకులక్షితీశు లపవర్గపువాంఛ వసింతు రీయెడం
బ్రాకటయోగనిష్ఠత నపత్యనివేశితరాజ్యభారులై.

(రాముఁ డడవికి నమస్కరించును)

కణ్వ—రామచంద్రా! అనన్యతపోవనసామాన్యమగు నీనైమిశ
వనమాహాత్మ్యముం గనుఁగొంటివా?

మ. కన శేయాకుల వాటనీను విలసత్కాసారవారిప్లవం
ఋజుమాత్రం బొకరింపఁ జూనదు మనుష్యాలోకమాత్రం
బెగాక నిదాఘాతప మివ్వనిన్ మనెడు శ్రీశంకోత్తమాంగ
స్థలస్థనిశానాథకలావిమిశ్రణకదుష్ణత్వమ్ము దానొందుటన్

అంతియగాక—

శా. చిత్తానందదనందనాదివిటపిశ్రేణిన్ విసర్జించి యే
తత్తుంగేష్టిసమాగతేంద్రభటబాధ స్తంభ తాంప్రాపితా
త్యుత్తాలాఖిలసాలజాలము కరంబొప్పారెఁ గన్గొంటె యు
స్మత్తైరావణకంఠరజ్జువలయన్యాసక్షతిన్ రాఘవా!

రాము—(చూచి) నిరతప్రవృత్తాధ్వరసహస్రంబగు నీయుపణ్యా
రాజప్రభావవశమున నింద్రుఁడు సయితము స్వపురమును
మఱచిపోయెఁ గదా!

గీ. నిజమనోధవాకర్షణనిస్వనశ్రవణవశంబున భీతయై వాసవుసతి
పూనఁగాఁ జూనెను వియోగవేణి నిపుడు
లలితమందారసుమమాలికలఁ ద్యజించి.

కణ్వ—మఱియొకవింతయుఁ గలదు. చూడుము—

చ. పరఁగఁ గపోలభాగమదపానవిధానసమాకులంబులై
యరమర లేక మూఁగు మధుపాళికిఁ గూర్చ వొకింతవిఘ్నమా

దరమునిగీతసామనినదశ్రవణోత్సుకతాత్యజన్నిరం
తరచలనంబు లైన మదదంతికులాయతకర్ణతాలముల్.

రాము—(నవ్వి) ఇం దాశ్చర్య మేమి?

గీ. అతికఠినవిరహవ్యథావ్యథితమాన
సులకె మోదదం బయి శ్రావ్యముండ మిగుల
శ్రావ్యమైన యీమునిజనసామరవము
సంతసము నీదె మదగజసమితికెల్ల?

కణ్వ—(తనలో) ప్రవాసదుఃఖ మీరాముని నధికముగా పీడించుచున్నది. వేయేల? అధోముఖములగు మృగములను సయితము విరహవ్యథాపీడితులవలె శూన్యహృదయములుగా నెంచుచున్నాఁడు. (ప్రకాశముగ) రాఘవా! ఇది చూచితివా?

చ. మునులతపఃప్రభావమునఁ బొల్పుగఁ బూచిన మావికొమ్మలామనిదొర బాసి యేఁగినను మత్తసుమంధయముల్ త్యజించి చయ్యనఁ గ్రతుహోమధూమము భయంకరవృత్తిని బాధపెట్టఁగాఁ బనివినుచున్న వాకొలనిఁ బంకజగర్భములందు డాఁగఁగన్.

రాము—అబ్బా! ఎడతెగని ఆహుతులచే అంతకంతకు హెచ్చు పెరిగి పోవుచున్న యీ అగ్నిగుండపుపొగ తుమ్మెదలను వలె మనలనుగూడ బాధించుచున్నది. (పొగబాధ ననుభవించును.)

కణ్వ — పొగచే నీకను లెఱ్ఱవాఱి నీరు గ్రమ్ముచున్నటుల కనుపించుచునే యున్నవి.

రాము — మిత్రమా! కేవలము నీరు క్రమ్ముటయే కాదు—

గీ. అవనిజాతను నడవుల కనిపినదిగ
కాల్వలై పాఱ నశ్రువుల్ కాఱి కాఱి
పోడిమి చెడిననాకనుల్ మొదలె మోస
మునకు గురియౌచుచున్న పీపొగలవలన.

కణ్వ — అటులైన ఈకనంబను ఆశ్రమసరోవరమున స్నాన పానాదులం జేసి నయనసంతాపము వారించుకొని క్షణ కాల మిచట విశ్రమించియుండుము. వాల్మీకిమహర్షికి అగ్నిహోత్రసమయముగూడ సమీపించినది. కాన నే నొకమా టాయనకడ కరిగి వచ్చెద. (నిష్క్రమించును)

రాము — (కొలనిదగ్గఱకుం బోయి) ఆహా! ఈకమలాకరమం దలి నీ రెంత నిర్మలముగా నున్నది? (నీటిలో చూచి) ఏమి యీచిత్రము! సీత ఇచటి కెట్లు వచ్చినది? నిజముగా నే చూచునది సీతయే యైయుండునా? లేక పొరబడు చుంటినా?

(సంతసమును, ఆశ్చర్యమును సూచించును)

సీత — (రాముని జూచి) ఎంత మోసము జరిగినది? హంస మిథునానురాగావలోకనస్పృహచే ఆర్యపుత్రుం డిచట నుండుటయే గమనింపక అరుదెంచి ఎంత పొరబాటు

చేసితిని? ఇఁక నే నిచట నుండుట భావ్యము కాదు.
మఱలి పోయెద. (పోవును)

రాము——(నీడను చూచుచు) అక్కటా! సీత నన్ను సమ్మా
నింపకయే మఱలి పోవుచున్నదే!

గీ. శుభ్రసంస్కారమే లేమి సొగసు చెడిన
ముంగురుల్ గ్రమ్మ వెల్లనిమోముతోడ
దర్శనం బిడి మఱల మద్వాంఛితములు
కూడ రాఁ జనుచున్న దీజాడ సీత.

పోనీయక పట్టుకొని ఈమెను నాబాహుబంధమునం జేర్చెద.
(చేతులు సాచి) అక్కటా! ఎంత భ్రమ నొందితిని? ఈమె
సీత కాదే.

గీ. కొలనిదరిని నీత్రోవ వెంబడిని నెటకొ
అరుగుచుండ క్ష్మాసుత, నీట నాపెరూపు
వేగఁ గని చెలి యను భ్రమ వెఱ్ఱి నైతిఁ
గాని ముమ్మాటి కిది సీత గాదు కాదు.

రాము——ఈప్రతిబింబముయొక్క మూలప్రకృతి నరసెదఁగాక.
(వెదకును) అక్కటా! ఈసరోవరప్రాంతమంతయు జనసం
చారరహితముగా నున్నది. మనుష్యునిజాడ లెచటను
గాన్పించుటలేదు. (కొంచె మాఁగి) అయినను మనుష్యు
లెవరును లేకున్ననీటిలో ఈ రూపము కాన్పింపఁగలదా?

సీత——ఆర్యపుత్రుఁడు నానీడనుమాత్రము చూచి నన్ను చూడఁ
జాలకుండుటకు కారణ మేమైయుండును? (ఆలోచించి)

ఆ. తెలసినది. ఈఆశ్రమసరోవరతీరమున నుండు స్త్రీలు పురుషుల కగుపడకుండునట్లు వాల్మీకి యనుగ్రహించి యున్నాడు. నీటిలో నీడ కూడ కనుపడకుండునట్లు చేసిన నెంతయో బాగుండెడిదిగదా! నానీడ నయిత నార్యపుత్రున కగుపడకుండున ట్లొనర్చెద. (ఆవల కేఁగును)

రాము—పోనీ! ఆవ్యక్తి కానుపింపకున్న నేమి? నీడకూడ మాయమై పోయినదే! (దుఃఖమున మూర్ఛిల్లును)

సీత—(త త్తరముతో) అయ్యో! అయ్యో! ఆర్యపుత్రుఁడు మూర్ఛ నొందినాఁడు. ఇఁక నేమిచేయుదాన? సమీపించి సేవ సేయుదునా? (నాలు గడుగులు వైచి మఱల ఆగి) ఆర్యపుత్రుఁడు నన్ను దెలసికొనినయెడల మఱల కోపించునేమో! మునులుకూడ యీసీత అవినీతయని తలంతురుగాఁబోలు. అట్లని యిట్టిసమయమున కఠినహృదయనై సమీపమున కేఁగకుండుట అసంగతముగదా! ఏమైనఁ గానిమ్ము. యుక్తాయుక్తములు విచారించుట కిది సమయము గాదు. ఆర్యపుత్రుడు కోపించిన కోపించుఁగాక. మునులు నన్నవినీతయని తలంచిన తలంతురుగాక. ఏమైనను సరియే ఆర్యపుత్రుఁ డిట్టిప్రమాదావస్థలో నున్న సమయమున నాకన్నులతో చూచుచు నిట నొక నిముసమైన నిలువజాల. (మఱల నాలు గడుగులు వైచి) ఓలోకపాలురారా! ఇటు వినుడు. నే నార్యపుత్రునిచే విడనాడఁబడినను ఇపుడు మతిహీననై యీతనియాదేశము నతిక్ర

మించుటలేదు. కాని శోకావేగముచే బలాత్కరింపఁబడి యిట్టి విషమావస్థయందు నిలువఁజాలక యీసాహసకృత్య మునకు గడంగుచున్నాను. (సమీపించి చూచి) హా! దైవమా! ఎట్టి ఘోరకార్యమున కొడిగట్టితివి? ఆర్య పుత్రుని మేన ప్రాణము లున్నటులు కానుపించుటలేదు. ఇఁక నే నేమి చేయఁగలదాన?

(దుఃఖించుచు కౌఁగిలించికొనును. రాముఁడు తెలివి నొందును. సీత ఆవల కేగును.)

రాము — అకస్మాత్తుగా దేహ మంతయు బులకితమైపోయినదే! దీనికి కారణ మేమై యుండును?

సీత — నిర్వాసితనయ్యు నిట్టిసాహసకృత్యమొనరించి నిజముగా భీత నయితిని.

రాము — (శోకించుచు) హా! వైదేహీ వైదేహీ!

గీ. గాఢతరపరిరంభ సౌఖ్యమ్ము నిమ్ము

సీత — అనపరాధనుగదా! కాని......

రాము — సకలతాపాపహమ్ము దర్శనమునిమ్ము

సీత — అణిమాదియోగసిద్ధి సంపన్నులగు మహనీయుల ఆజ్ఞ లకు లోఁబడి అస్వతంత్రనైన నే నేమి చేయఁగలను?

రాము — వడిగ నతిదీర్ఘరోషంబు వదలి రమ్ము

సీత — నేనును మనోహరు నిట్లే వేఁడుకొనుచున్నాను.

రాము — స్వాంతమున నిర్దయతఁ బూనఁ జనదు సుమ్ము.

సీత—ఆర్యపుత్రా! ఈఉపాలంభము కడుంగడు విపరీతము సుమా.

రాము— గీ. దేవి! విన్నవించుచునుంటి నీవు తలఁప

సీత—ఏమది ! ఆజ్ఞాపింపుము.

రాము— అమలచారిత్రవిలసితవైన నిటులు

సీత—కావుననే ప్రాణములు వదలివేయుటకు మన సొప్పకీ గతికి దెచ్చుచున్నది.

రాము— విడచిపుచ్చితి నిన్ ఘోరవిపినభూమి

సీత—నాథునియాజ్ఞల కెల్లను బద్ధులే గదా!

రాము— వెసను సైరింపు మీనాదుదోసఁగుఁ గూర్మి.

సీత—ఇఁకనైన ఈమందభాగినిపై ననుగ్రహ ముంచుము.

రాము—ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ!

ఉ. ఎన్నఁడు కన్నుదోయి ఫలియింపఁగ నిన్ను గనంగలాఁడ నిం
కెన్నఁడు నీదుకూర్మినుడులీచెవులన్ విని యుబ్బువాఁడ నే
నెన్నఁడు పూలపానుపుపయిం గయిదిండులఁ గమ్ముపాఁడ
నోసన్నుతగాత్రి! నిన్గలిసి శారదరాత్రులపండువెన్నెలల్.

సీత—జనాపవాదభీతహృదయా! ఆర్యపుత్రా! సమీపముననే సమ్ముఖమున నున్నవారలపై యింత సంతాపము నొందు చుంటివా ?

రాము—హా! వైదేహీ! జనకనందనీ! మాటాడవా? ఏమి యీనిష్ఠురత! (మూర్ఛిలును)

సీత—దైవమా! ఆర్యపుత్రుని మరల మూర్ఛిల్లజేసితివా? ఇంక నే నేమి చేయుదు? (ఒకవస్త్రముతో విసరును)

రాము—(కొంచెము తెలివొంది) చేయి సాచి వస్త్రము గొని, (ఆశ్చర్యముతో) ఏమిది? చేలాంచలమువలెనున్నదే! ఆహా! ఇట్టిసమయమున నాకు సహర్యసేయు నీ వ్యక్తి ఎవరై యుండనోపు? (విచారించి)

గీ. సాధుచారిత్రవిలసిత జనకసుహిత
యొక్కతె యెగాక అవని నిజోత్తరీయ
కాంచలానిలంబుల మదీయావయవము
లిటులు స్పృశియింప సమర్థు లేఎవ్వ రౌరులు?

అయినను చూడక నిర్ధారణ చేయుట మహాదోషము. (కనులు తెఱచి) అనవరతబాష్పధారాసమాచ్ఛాదితము లగు కతన నాకనుల కేమియు కానరాకున్నయది. కాన ఈవస్త్రమును లాగికొని కనులు పరిశుభ్రము గావించికొనియెద. (అట్లే లాగి కనులు తుడుచుకొనును)

సీత—(వస్త్రమును వదలి) ఆర్యపుత్రా! ప్రణయకోపము నొందిన వానివలె ఇతరులయుత్తరీయముచే నీఅశ్రువులం దుడిచికొన దగునా?

రాము—(ఉత్తరీయము నేలపైఁ బడుటం జూచి ఆశ్చర్యముతో) ఏమిది? వస్త్రముమాత్రము నేలపైఁ బడుట స్పష్టముగా గనుపించుచునే యున్నది. కాని ఆవ్యక్తి కానుపింపదేల!

క. తలఁపఁగ నంబరతలని
గ్గలితహిమాంశ్వమలదీప్తికంచుకరాజ
ల్లలితం బీ యన్యపటగాం
చల మవిచారముగ లాగి సలిపితి దొసఁగుల్.

(మఱల ధ్యానముతో చూచి) ఇంచుకైన నాలోచింపక ఎంత మందమతినైతిని ? పూర్వము చిత్రకూటవాసదేవత యగు మాయావతిచే నీయుత్తరీయము ప్రసాదింపఁబడి యుండెనుగదా?

చ. మురిపెపుజూడమందుఁ బరమం గళపాశము నర్మకేళులన్
స్మరసమరావసానముసఁ జల్లనివీవన యప్పటప్పు రా
త్రికలహంబులందుఁ గసిఁ దీర్చెడు కల్పితకోపశయ్యయీ
ధరణిజయుత్తరీయము విధాతకృపం గనుగొంటి నేఁడిటన్.

సీత—ఆర్యపుత్రుఁ డీయుత్తరీయమును బాగుగా గుఱుతించి నాఁడు.

రాము—ఎఱుఁగక నేలపైఁ బడవేయఁబడిన యీయుత్తరీయ మున కిఁక నేవిధముగ తగు సత్కార మొనరింపగలవాఁడ? (విచారించి) ఇంత ఆలోచింపవలయునా? దీని కిదియే సన్మానము (తీసి తనదేహమునంతయు కప్పుకొని, తనను చూచుకొని) వస్త్రద్వయమును కప్పుకొనిన నన్నుఁజూచిన మును లేమనుకొనియెదరో కాన నాయుత్తరీయమును వదలివైచెద. (తనయుత్తరీయమును దీసినేలపై వైచును)

సీత—(ఆయుత్తరీయమును తీసికొని సంతోషముతో) అహా! ఇంతదనుక నెట్టెటో జీవధారణ సేసినందులకు తగిన ఫల మనుభవించితిని. ఎంత సుకృత మెంత సుకృతము! (ఆఘ్రాణించి) అహా! అన్యవనితాకరగ్రహణపరాఙ్ముఖుఁడగు నామనోహరుని యుత్తరీయము విలేపనపరిమళవిహీనమై యున్నది. రఘుకులజులు సత్యసంధు లనుట కిదియే తార్కాణము. (కప్పుకొని) ఏమి నాభాగ్యము? ప్రియజనసంసర్గసహిత మగు కఠిన సుఖస్పర్శముగు నీయుత్తరీయమును కప్పుకొనినంతమాత్రమున ఆర్యపుత్రవక్షఃస్థలపరిశ్రాంతిసమయంబునంబోలె నాయొడలంతయు నొక్కమాఱుగ పులకితమైపోవుచున్నది.

రాము—(ఆశ్చర్యముతో) ఏమిది? నాయుత్తరీయము నేలపైఁబడకపూర్వమే ఎవరో అపహరించినట్లున్నది. దీనిని జూడ నామనోరథ మీడేరుకాలమునయితము సమీపించినటులే యున్నది. (ఆలోచించుచు) నాయుత్తరీయ మపహరించుటమాత్రము జలమునఁ గన్పడుచునేయున్నది. కాని నాసీతమాత్రము కానుపించుట లేదే! ఇదెందువలన నైయుండనోపు? ఇదంతయు సిద్ధాశ్రమవాసులగు మహనీయులమహిమ కాఁబోలు. సీత నెటొంగికొనఁదగు నుపాయ మెయ్యది? హా! వైదేహీ! వైదేహీ! నీదర్శనమైన నొసంగక నన్నిట్లేల పీడింతువు? పూర్వపుసరసమును స్మరించియైన నన్ననుగ్రహింపకూడదా?

సీత—ఏమాసరసపువిషయము?

రాము—

చ. వనరుహనేత్ర! తొంటివనవాసమునం దల చిత్రకూటమం
దున నొకనాఁడు నీవు విరితోఁటలో పూవులు గోయుచుండ
నే వెనుకనె వచ్చి యవ్విరులు ప్రేమ నొయ్యనఁ గీలిఁ బార
వ్రాసి నాతనువున నీపటాంతమును దాల్చితి, నెంతు నె
య్యెన్నఁ డేనియున్.

సీత—(నవ్వి) సాహసికా! అందువలననే నేఁ డిట్టి వియో
గము సంభవించినది.

రాము—ప్రాణేశ్వరీ! ఇంచుకైన మాటాడవేల?

సీత—(విచారముతో) సాయంసమయము సమీపించినది.
ఇట్టియవస్థకు లోనై సంతాపము నందుచున్న ఆర్యపుత్రుని
అసహాయునిగ వదలి వెడలిపోవుటయు అసంగతము. ఏమి
చేయుదాన? (నలువైపుల జూచి) ఆహా! అదృష్టవశమున
కౌశికుఁ డేమియో వెదకికొనుచు ఈవైపునకే వచ్చుచు
న్నాఁడు. ఇఁక నానాథున కితఁడు సహాయుఁడై సంతస
మును గలిగింపఁగలఁడు కాన నేను మెల్లమెల్లన నరిగెద.

(నిష్క్రమించును)

(ఏదియో వెదకికొనుచు విదూషకుఁడు ప్రవేశించును)

విదూ—శ్రీరామచంద్రుఁ డిపు డెచట నుండియుండును?
ఎంత వెదకినను వానిజాడయైన కానరాకున్నది. కానిమ్ము,
ఇంకొకమాఱు వెదకిచూచెదఁ (వెదకిచూచి) ఓహో!
ఇదుగో! నాప్రియమిత్రుఁ డిచటనే వ్యాకులహృదయ

ముతో ఈసరోవరతీరమునఁ గూర్చుండియున్నాఁడు.
(సమీపమున కరిగి) రాజా! విజయీభవ.

రాము—(చూచి) మిత్రమా! కౌశికా! వచ్చితివా! ఇంత దనుక నెచట నుంటివి? నన్ను మఱచిపోతివికాఁబోలు?

విదూ—మఱచితినా! సూర్యోదయము మొదలుకొని నిన్ను వెదకుచునేయుంటిని. తుదకు సూర్యాస్తమయముకూడ సమీపించినను నీదర్శనము లభింపకున్నది.

రాము—ఎంత ప్రయాసము నొందితివోయి మిత్రమా! నన్నేల ఆతురతతో వెదకితివి?

విదూ—ఏమియు లేదు. నేఁటిప్రభాతసమయమున నేను మాధవీమంటపమున డాఁగియుండి-కొందఱు మునికన్యలు, అప్సరసలు నేనచట నున్నదియే గమనింపక తపోవన రహస్య మెయ్యదియో ఆలోచించుకొనుచుండఁగా విని యుంటిని. అది నీకు కొంచెము... ...అ.....ప్రియముగా నుండునేమో! అయినను దాని నప్పటినుండి కడుపులో దాచియుంచికొని చెప్పుకొనుటకు నీ వగుపడనికారణమున పొట్ట ఉబ్బి అబ్బా! పెద్దబాధ ననుభవించుచుంటిని.

రాము—అదెయ్యది? త్వరగా నెఱిగింపుము.

విదూ—నీ వెఱుఁగవా?... ... ఆమెను .........

రాము—(చెవులు మూసికొని) శివశివా! స్త్రీలసంగతియా? చాలుచాలు. ఇఁక విరమింపుము.

విదూ—వయస్యా! భయమునందకుము. మఱేమియుఁగాదు. నేను నీకు అంతరంగికమిత్రుఁడనుగదా? ఏల యీ వెఱపు? స్వర్లోకదాసిని నీవెఱుఁగవా?

రాము—(తనలో) ఓహో! ఇది దేవవేశ్యలసంగతియా! (ప్రకాశముగా) సరే! ఆమె యెవరు? తిలోత్తమయా? లేక ఊర్వశియా?

విదూ—ఆఁ. ఆమెయే. తిలోత్తమ సిలోత్తమయని నీవెఱుఁగవా? ఆమెయే నీచే నెన్నఁడో పరిత్యజింపబడిన సీతాస్వరూపమును ధరించి నిన్ను పరిహాసముసేయ నూహించుచున్నది.

రాము—(తనలో) సీతాస్వరూపమున నాయెదుటనున్నను ఆమెను గుఱుతింపజాలక ఎంత మోసపోయితిని?

గీ. వెసను దాహంబు తీవ్రమై యుసురు దీయ
నడవి నెండమావులఁ గని మలవిహీన
సలిల మను గంపెడాస నంజలి ఘటించి
ప్రోవఁ బ్రార్థించి మోహాన మోసపోతి.

(ఉత్తరీయమును జూచి) ఈ ఉత్తరీయమునుగూడ ఎంత నేర్పుతో నిర్మించిన దీమాయావిని! ఆహా! ఏమి దీని వంచనానైపుణ్యము! (ఆశ్చర్యము నొందును.)

విదూ—మిత్రమా! అట్లాశ్చర్యపడుచుంటివేల? ఆమె నిన్ను వంచించినదా యేమి?

రాము—ఆహా! మోసగించినదోయి.

(నేపథ్యమున)

మ. పరమౌర్వారమహత్ప్రతాపవిభవభ్రాజిష్ణుఁడై సప్తసాగర
వేలాభిపరీతభూతలము వీఁకం గాసిలం జేసి యుత్తటి సాయా
హ్నమునం బ్రచండరుచి మాంద్యం బందఁజొచ్చెన్ వయః
పరిణామంబున శాంత తేజుఁడవు దీప్యత్క్ష్మాధవుం డుంబలెన్.

రాము:—కౌశికా! చూచితివా! సూర్యుఁ డస్తాద్రిఁ కరుగు
చున్నాఁడు.

మ. పరదేశంబున నున్నభర్తలకునై భావంబునం గుంది క్ర
మ్మరి వా రెన్నఁడు వత్తు రంచు దినముల్ బల్మారు లెక్కించి
వంపురువాల్గంట్లకరాంగుళీవితతి నాప్తుం డేఁగ నస్తాద్రికిన్
భరమౌ వేదన నందఁజొచ్చె ముఖముల్ వాడం బయోరు
ట్తతుల్.

అంతియగాక —

మ. గతిరీతిన్ నియమించి ప్రగ్రహసమాకర్షంబునం దోత్రచో
దితముల్ భానుతురంగముల్ చకితవృత్తిం బొల్చు కాళ్లొప్ప
స్వీకృతవైధుర్యములై నిలం జనఁగ లేకట్టిట్లో అస్తాద్రికూ
టతటంబందుననుండి వారినిధి గిట్టల్ జొన్ప నుంకించెడిన్.

# కుందమాల

## పంచమాంకము

(విదూషకుఁడు ప్రవేశించును)

విదూ—(నేపథ్యమును చూచుచు) రామా! తపోధను లేతెంచుసమయము సమీపించుచున్నది కాన కొంచెము త్వరగా నీమాహ్నికవిధులు ముగించుకొనవలయును.

(రాముఁడు ప్రవేశించును)

రాము— గీ. స్నాన మొనరించి చన్నీట, జ్వలను వ్రేల్చి
యుదయభానున కర్ఘ్యంబు నొసఁగి భక్తి
వాసరాదివిధానంబు వరుసఁ జేసి
వచ్చి తిదె మానిదర్శనాభ్యర్థి నగుచు.

విదూ—ఈఆస్థానమంటపమునకు రమ్ము.

రాము—(అట్లే చేసి చింతాక్రాంతుఁడై) నిన్నటిదినమున నెట్టి ఆశ్చర్యమైన విషయము జరిగినది?

మ. పిఱుఁదుల్ దాఁకెడు వేణికాభరముతో క్షీణస్తనద్వంద్వభా
స్వరవక్షంబుతో పాండుగండయుగళీభాగంబుతో నాసరో
వరనీరంబున దర్శనం బిడిన యప్పద్మాస్య స్వర్లోకసుం
దరియో మర్త్యలతాంగియో యెఱుఁగ నక్తాపంబు
నొందించెడున్.

(విచారము నొందును.) (కొంచె మాగి) ఒకవేళ నిది యంతయు తిలోత్తమ యొనరించిన కపటనాటకమే యనుకొనినను—అమె, వైదేహిచే స్వయముగా కూర్పఁబడిన కుందమాలికం బోలిన మాలికను, ఇసుకతిన్నెలపై అవే పాదములవంటి పదచిహ్నములను, సరోవరజలమున సాక్షాత్సీతాసమానమగు ప్రతిబింబమును దేవతాంగన యగుట వలన తనప్రభావమున నిర్మింపఁగలదు. కాని—అన్యవనితా పరాఙ్ముఖుఁడనగు నన్ను తన చీరకొంగుతో విసరుచు స్పృశింపఁగలదా? అసంభవము.

విదూ—(రాముని సమీపించి) మిత్రమా! నీవీ మంటపాభ్యంతరాగతుఁడవై ప్రావృట్సమయసజలజలధరనికరరుచిరాకారుండవును, నవముక్తాహారవారసమలంకృతవిశాలవక్షఃస్థలశోభితుఁడవును అగుకతన అత్యున్నతములును, అతి విశాలములును, దురారోహములును, అగునింద్రనీలమణిమయభవనస్తంభములలో నొకరుఁడుగ నాహృదయమున కత్యంతవిభ్రమము గలిగించుచుంటివి. లక్ష్మీనివాసభవనంబును, సేవాసమయసముపాగతసామంతక్ష్మామండలాధీశ్వరమధురరవోపగీయమానమగు నీఆస్థానమంటపపుండరీకమునకు కర్ణికామండలముంబోలె మధుమథనావసరనాభీసరఃపద్మమధ్యాధిరూఢుఁడగు పితామహుని వైభవము నధిక్షేపించుచు నీసింహాసనము నధిష్ఠింపుము.

రాము—(అశ్లే కావించి) (విచారముతో) నేఁడు మఱల నిం కొకరకపు నూతనసుఖదుఃఖములకు గుఱియైతిని.

(భూమ్మిపైచేతులు వైచుకొని)

చ. అవనితనూజఁ గానలకు నంపిననాఁడె నిరాశ నాపైపైఁ
దవులముఁ బాసి యెన్నఁడు ముదంబును శోకమునైన లేక
నేఁడు విధివశంబునన్ గని మహంగున నీడఁ బటాదికంబు
శోకవిధురమై యుధైర్యమును గాంచఁగఁజొచ్చెను డెంద
మక్కటా !

(చింతిల్లును.)

విదూ—(పరిశీలించి చూచి) (తనలో) నే ననుదానికి తగిన
సమాధానమైన నీయక యాతఁ డెద్దియో సుఃఖమున
నోడలు మఱచుచున్నాఁడు. ఈతని మనోగతము నెఱింగి
యెట్లైన ఈతనిదుఃఖమును దూరముసేసినఁగాని మేలు
గానరాదు. (ప్రకాశముగా) సార్వభౌమా! చూచితివా?
ఈసింహాసనసింహరాజములు అతిదుర్భర భారభరణపరిశ్రాం
తములువోలె ముఖవివరవినిర్గతముక్తాకలాపవ్యాజమున
నురుగులు క్రక్కుచున్నవి. దీనినిబట్టి చూడ తమరు
బాహుద్వయమున భూమండలమును, వక్షస్థలమున
భూజాతను వహించుటవలన మిక్కిలి బరువుగా నున్నట్లు
నాకు తోఁచుచున్నయది.

రాము—(తనలో) ఈతఁడు భావగర్భితములగు వాక్యములచే
సీతావృత్తాంతమును వినియుండికాబోలు నాచే చెప్పింపఁ
గడుంగడు ప్రయత్నించుచున్నాఁడు. అయినను బాల్యము
నుండియు నాకత్యంతహితుఁడుగదా. ఈతనికి యథార్థస్థితి
యంతయు నెఱింగించెద. (ప్రకాశముగా) మిత్రమా !

నీకీ కుయుక్తు లేల? నేను వైదేహిని స్మరింపని నిముస మొకటైన నుండదు.

విదూ——ఎందువలన? సుగుణములవలననా? లేక అవగుణముల వలననా?

రాము——ఆరెంటివలనను గాదు.

విదూ——అలాగా. ఈరెండును కానిచో పురుషులు స్త్రీల నేల స్మరింతురు?

రాము——దంపతులలో ప్రేమావేశము కారణానుబంధమై యుండుట లోకసామాన్యము. కాని సీతారాములవిష యము మాత్ర మట్లు గాదు.

మ. వనవాసాదివిపత్పరంపరలు సంప్రాప్తింపనీ, నర్మిలిఁ
మణిసౌధాంతరరత్నడోలికల నానందింపనీ, సద్గుణా
ద్యనపేక్షంబయి నిర్వికారమవు నవ్యాజానురాగాన నొయ్య
నిబద్ధాత్ములమై పరస్పరము సౌఖ్యం బందమేయెంతయుఁ

విదూ——వయస్యా! సుమసమానమానసయగు నవనిజాతంబోలె మధురసంబులగు కృత్రిమవాక్యములచే మాబోటివారలను గూడ వంచింప నెంచుచుంటివా ? కావుననే సీత సామీ ప్యమున లేకున్నను ఇంతదనుక ......

రాము అట్లుకాదు సుమా. రామునకు సీతపై బ్రేమ బాహ్యాడంబరమే కాని వాస్తవమున నిసుమంతయు శూన్య మని తలంపకుము.

గీ. వెలికి నత్యంతకఠినత వెతలఁ బడఁగ
వైచుచున్నను, నాపైపైఁ బాసుకొనియ
స్వాంతమునఁ గల యనురాగపాశతతులు
జలజనాళాంతరితతంతువులవిధాన.

విదూ—మిత్రమా! నే నట్లు తలంతునా? ఆభీలజ్వాలాలోలమై గర్భస్థితమగు బడబానలముచే పయోరాశివోలె నీవు దుస్సహహృదయసంతాపసంతప్తుఁడ వగుచుంటివి. నేనో అతిమృదుస్వభావుండనగుకతన నవనిజ యనుభవించు దుర్గతిని మాటిమాటికి తలఁపోసి దాహానలముచే తుషారబిందువుచందమున సంపూర్ణముగ రూపుమాసి పోవుచుంటిని.

రాము—సీత స్మరింపఁదగునదియే యని నీ వెఱింగికొనినపుడు నేను సీతను విడనాడ స్థిరసంకల్పము గావించికొనినసమయమున నన్నేల నిరోధించితివికావు?

విదూ—అప్పుడా! ప్రసాదసుముఖులే యైయున్నసమయమున నే మహారాజులయెదుట మాబోంట్లు నోరెత్తుట అసంభవము. అట్టిచో దారుణకోపభీషణులై యున్నతరి నిఁక వేఱె చెప్పవలయునా?

రాము—ఓహో! అదియా నీభయము? అస్మాదృశు లెన్నఁడును మిత్రులకు సయితము పలుక వెఱపుగలిగించునంతటి కోపావస్థ నొందరుసుమా.

చ. అరయ నతిప్రవృత్తమవు నాయతతేజమునన్ మహా
గ్రహుఁడై పరగెడునప్పు డేనిని నివారణసేయఁగ నోఁప బుధా
ను లందరు, నిజభానుదీప్తి భువనంబుల నెల్లఁ దపింపజేయు
నయ్యరుణుని నీలనీరదచయం బరికట్టదె యాకసంబునన్.

మిత్రమా! ప్రస్తుతసీతావృత్తాంత మిరువురకును సంతాప దాయకముగనే యున్నది. నీ విఁక త్వరితగతిం బ్రతీహార భూమి కరిగి—తపోధను లేతెంచుసమయ మాసన్నమైనది కాన ద్వారము లన్నియు దెఱచి జాగరూకులై యుండుఁ డని ప్రతీహారుల కాజ్ఞాపింపుము.

విదూ—కందమూలఫలాదులను భక్షించుచు, చినిగిన నీ రాకవిశోకలను ధరించి, చేత కొంకికఱ్ఱలఁ బట్టుకొని, మీసములు గడ్డములు పెంచుకొని యొక వింతయాకార ముతో నుండుముసలితాపసుల కింత గౌరవ మీయవల యునా?

రాము—ఏమంటివి? తుదకు నీకు మంచి సందేహమే తోఁచి నదే! జ్ఞానఘనులగు తపోధనులన నంత చులుకనగా నెంచు చుంటివి కాఁబోలు. జ్ఞానసంపద పరబ్రహ్మసంబంధము లగు సకలపురుషార్థములకును సాధనభూతముగదా! చూడుము—

గీ. పరఁగ నర్థగతంబును బ్రకటపఱుప
నోప దంతస్థసత్తేజ మాప్తోపదేశ
హీన మగునెడ, ననల మొకింత యేనిఁ
బ్రజ్వలించునె గాలితోడ్పాటు లేక.

విదూ—తాపససమాగమము మీరు నుడివినటులు మహదర్థ సాధక మగునెడల నేనును సగౌరవముగా మీయానతిఁ గావించి వచ్చెద. (నిష్క్రమించును) (కొంచెమసేపాగి మఱల ప్రవేశించి) రాఘవా! స్నిగ్ధశ్యామలాకారులును, బాలభావభావితులును, అసంప్రాప్తప్రమాణులును, అప్రమత్తులును, రూపసంపదచే మారకుమార సుకుమారులును, సాలభూజములవలె అత్యున్నతులును, ప్రస్ఫుటాకృతులును, లోలతరులును, మహాబలులును, అత్యంతధీరులును, అత్యంతలలితులును, ఉదారులును, అగు నిరువురు తాపసకుమారులు మీయెదుట తమ గానకళానైపుణ్యమును ప్రకటింప బాల భావమున మంగళాంకురములోయన తోరణస్తంభసమీపమున కరుదెంచియున్నారు.

రాము— (సాభిప్రాయముగా) అట్లైన వారి నిటకుఁ దోడ్కొని రమ్ము.

విదూ—వా రిరువురు నిట్లు వచించుచున్నారు.

రాము—ఏమని?

విదూ—వారు వాల్మీకిమహర్షి శిష్యులఁట. వీణావాద్యమున వారి కపూర్వమగు నైపుణ్యము గలదఁట. అంతియగాక— రాజులు గానిండు, తదితరసామాన్యజనులు గానిండు. ఎవ రైనను సరియే, వారిగానమును వినునప్పుడు తాపస సన్మానార్థమువారితోఁబాటు నేలపైననే గూర్చుండవలయునఁట. అనుపమపదవిన్యాసభాసురమును, మహాకవిసంగ్ర

థిత మహాపురుషపుణ్యకథానిబంధమును, మహదర్థగంభీర
మును,అశ్రుతపూర్వమును, గాంధర్వవేదసమ్మితమును,సరస
మును, యోగవర్ణితవర్ణరమణీయంబును, అగు గీతమును
కర్ణరసాయనముగ గానము సేయుచుందురట. వింటివా
మఱొకవిచిత్రము! ఈగానమును విని సంతసించి ఏధరా
కాంతుఁ డెయ్యదాచరించునో అదంతయు మఱల తన
కెఱింగింపవలయునని వాల్మీకిమహర్షి వారల కాజ్ఞాపించె
నఁట.

రాము—ఏమి వీరివిద్యాగౌరవము! స్వచరిత్రవర్ణనము !
మిత్రమా! మఱల నరిగి వారిచరిత్రమంతయు సంపూర్ణ
ముగా నెఱింగి వారినియమముల కొడంబడి త్వరగా
దోడ్కొనిరమ్ము. ఆలసించిన కోపగించి మఱలిపోవుదు
రేమో? పొమ్ము. త్వరగాఁ బొమ్ము.

విదూ—ఏమి యీతొందర? వారల అన్యోన్యవత్సలత్వమును
ఆకారసాదృశ్యమును, కాకపక్షభూషితమగు సుందరవద
నారవిందమును, చూడఁజూడ మీతమ్ముఁడు సౌమిత్రియు
మీరును, దశరథునిమ్రోల నున్న రాజాస్థానము నలంక
రించిన దృశ్య మంతయు స్ఫురణకు వచ్చి నానయనములు
రెండును అశ్రుధారాపూర్ణములై పోవుచున్నవి.

రాము—వారియాకృతి మాబాల్యావస్థ ననుకరించుచున్నదా?

విదూ—అని వేఱె చెప్పవలయునా ?

రాము—అట్లైన వారినిం జూడక నామనసింక ఆగునట్లు లేదు. త్వరగా పోయి వెంట నిడుకొని రమ్ము.

విదూ—దేవరయాజ్ఞ. (నిష్క్రమించును)

(విదూషకుఁడు త్రోవఁ జూపుచు కుశలవులం దోడితెచ్చును.)

విదూ—తాపసకుమారులారా! ఇటు దయచేయుఁడు.

కుశుఁడు—(లవునితో) తమ్ముఁడా! ఇంతకుఁబూర్వము నేను వాల్మీకిమునికి నమస్కరించి రాజభవనమునకు బయలు దేరుసమయమున కాకపక్షమిడచే నిన్ను పర్ణశాలలోనికిఁ బిలచి మన యమ్మ నీకెయ్యదియో వచించినట్లున్నది. అది యేమి?

లవ—మఱేమియు లేదు. పర్ణశాలలోని కరుదెంచి మన అమ్మ నన్ను గట్టిగా కౌఁగిలించుకొని ప్రతిదినమున కంటె అతిప్రసన్నమగు వదనముతో నన్జూచుచు నాయనా! మీ రిరువురును స్వాభావికమగు గర్వమును విడనాడి నేఁడు మహారాజును దర్శించి నమస్కరించుటయే గాక కుశల ప్రశ్నకూడ చేయవలయునని చెప్పినది.

కుశ—కుశలప్రశ్నా! సరే చేయుదము. కాని నమస్కరించడ మెలాగా?

లవ—ఎలాగా? నీవెఱుఁగవా?

కుశ—మనవంశీయుల కితరులు నమస్కరింపవలయును గాని మన మితరులకు నమస్కరింపఁగూడదటఁగా?

లవ—ఇ దెవరు చెప్పిరి?

కుశ—మనఅమ్మయే చెప్పినది.

లవ—అలాగా! నమస్కరించవలెననికూడ ఆమెయే చెప్పినది. మనకీ విచారణ యేల? గురువులు చెప్పినదానిమీఁదట మనము తర్కవితర్కములు చేయఁగూడదుసుమా.

కుశ—సరే, పద. సమయానుకూలముగా చేయుదములే. (నడతురు)

విదూ—బాలురారా! యిటు రండు.

రాము—(చూచి) ఏమిది? ఈమునికుమారు లిరువురు సమీపించినకొలఁది నాహృదయ మస్తవ్యస్తమై [illegible]మన్నది?

క. ఈవచ్చెడుసుకుమారకు
లేవారలవారొ, వీరిహృద్భావం బే
దో, వేద్యము కా దశ్రువు
వే వీక్షించినది మొదలు విడివడఁ దొడఁగెన్

ఇం దాశ్చర్య మేమి?

చ. సొరిదినిఁ గూర్చునాప్తు లొకచోటను గూడినఁ దొంటి బాంధవం బెఱుఁగకయున్న నూరకయ యెంతయు దిగ్భ్రమ నొందు డెందముం దిర మొనరించుకొం(డ్రు)దు, తను తెన్నునఁ గ్రమ్మఱి, నైందవోపలం బరయకయే ద్రవింపదె గుణాగుణముల్ విధుఁ డేగుదేరఁగన్.

వీరియాకార మెట్టిదో పరిశీలించి చూచెదఁగాక. (చూచి కనులు తుడిచికొనుచు) అక్కటా! ఏమి చేయుదు? బాష్పధారాసమాచ్ఛాదితంబులగుకతన నా కనులు కాన

రాకున్నయవి. వీరియాకారమును చూచినకొలంది నా హృదయ మేలనో సాధ్వస, హర్ష, శోక, అనుక్రోశ, ఖేదచిత్రమగు నవస్థావేశవిశేషవిశిష్టమై మూర్ఛనొందు చున్నటు లున్నది. (ఇంచుక మూర్ఛిలి తెప్పరిలి) అబ్బా! ఈబాష్పప్రవాహ మికనైన శాంతింపదేల? (కన్నులు తుడిచికొని తేరిపార చూచి) ఆహా! ఏమి వీరిఆవయవ సౌష్ఠవము! తనూవేషరచనా చాతుర్య మెంత మనోహర ముగా నున్నది! ఏమి యీవినయోవియోదాత్తమగు నడత! ఆలోచించి చూడ వీరిరువురును సత్కులసంభూతులై యుందురని తోచుచున్నది.

విదూ—బాలురారా! మహారాజిచటనే సింహాసనాసీనుఁడై యున్నాఁడు. రండు.

కుశ—తమ్ముఁడా! నమస్కారవిషయమున నేను చెప్పిన దిపు డేమైన విచారించితివా?

లవ—ఇపుడు విచారించుట కేమున్నది?

కుశ—అంతేనా? సమీపించినకొలంది యితనిమ్రోల నెట్లు మెలంగుదునా యను సందియముచే నాచిత్తము తత్తరమందుచున్నది. స్వాభావికమై సమానమగు నవలేపము నిపు డెట్లు విడనాడఁగలను? ఈతనిమ్రోల నిలువఁబడి నాశిర మెట్లువంతును?

లవ—నిజమే. నీవలెనే నాకును తెలియరాని వ్యాకులము గలుగుచునే యున్నది. ఏమైనఁ గానిమ్ము. తల్లియాజ్ఞగదా! నమస్కరింతము (ఇరువురు సమీపించి నమస్కరింతురు)

రాము — మునికుమారులారా! వలదు. వలదు. మర్యాదనతిక్ర
మించి మీ రిట్లు నమస్కరింపఁదగునా ? ఎంతటిదోషము
నకు గురినైతిని? మునులచే నమస్కరింపఁబడుటయా ?
(విషాదమును సూచించును).

విదూ — సార్వభౌమా ! ఏల అట్లుచింతిల్లెదవు ? ఈముని
కుమారుల ప్రణామమును నీ వంగీకరింపలేవుగదా !

రాము — కౌశికా! బాగుగా నంటివి. కుమారులారా !

గీ. అధికసంభ్రమమున నాకునై యొడంద
వినయ మొప్పార మీరు గావించినట్టి
యీప్రణామంబు మీదేశికేంద్రునమల
చరణముల కుపహారమై పరఁగుఁగాత.

విదూ — నాప్రియమిత్రుని శాసన మప్రతిహతము. ఈప్రణామ
పరిణామము —

కుశలవులు — (లేచి) మహారాజా! కుశలమా?

రాము — మీదర్శనముచే కుశలముగా నున్నట్లే యున్నది.
అది యటుండనిండు. నేను మీకుశలప్రశ్నకేగాని అతిథి
జనోచితమగు గాఢాలింగనమునకుఁ దగనా? (కౌగిలించు
కొని) ఆహా! కుసుమసుకుమారములగు నీబాలురయవ
యవములను స్పృశించినంతన నాడెంద మపరిమితానంద
కందళిత మగుచున్నది. (ఆలోచించి) నే నింతదనుక
పుత్రపరిష్వంగసౌఖ్య మెఱుంగనుగదా! కాన నేఁ డియ్య
దియే ఆమహాద్భాగ్యముగాఁ దలంచెద. తపోవనపరా

ఖ్ముఖులగు గృహస్థు లిట్టియా కార్యములకుం గడంగుట సహజమేగదా! (తనసింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి కొనును)

కుశలవులు—మహారాజా! రాజసింహాసనముపై మేము కూర్చుండఁదగునా?

రాము—ఏదేని వ్యవధాన మున్న యెడల దోషము రాబోదు. కాన నాతొడపైఁ గూర్చుండుఁడు.

(తొడపైఁ గూర్చుంటఁబెట్టుకోఁ బోవును)

కుశలవ—(అసంతుష్టముతో) రాజా! వలదు. వలదు. మాపై నంతటి యనురాగమున్న చాలును.

రాము—బాలురారా! ఏల యీ సంకోచము?

గీ. లలి గుణాధికులకు నుపలాలనీయు
లర్భకులు వారిచిఱుతప్రాయమునఁజేసి,
భవశిరఃకైతకచ్ఛదత్వమున మెఱయు
టరయ బాలభావమునఁగదా విధుండు.

(అశ్రువులం గార్చుచు మఱలఁ గౌఁగిలించికొని తొడలపై గూర్చుండఁబెట్టుకొనును) (విదూషకునితో) కౌశికా! సీత నడవులకు పంపి ఎన్ని సంవత్సరములైనదో నీకు జ్ఞాపకమున్నదా?

విదూ—(విచారించి) ఆ. జ్ఞాపకమున్నది. (చేతి వ్రేళ్ళను, కాలివ్రేళ్ళను లెక్కించి) ఎందుకీలెక్క? ప్రస్తుతము పదవ సంవత్సరము గడచుచున్నది.

రాము—(కుమారులం జూచి) పూర్వజన్మభాగ్యమున సీతా గర్భము ఫలించియుండిన ఆసంతానముసయితము నేఁటికి ఇంతవయస్సుతో ఇట్టిస్థితితో నాకత్యంతము సంతస మొడ గూర్చుచుండెడిదిగదా!

విదూ—అక్కటా! స్వప్నమందైనను కనుపడని రామతనయ వార్తాశ్రవణముచే నాయొడలంతయు స్తబ్ధమై పోవుచున్నది (ఏడ్చును.)

రాము—ఈతాపసకుమారులను జూచినకొలఁది నాహృదయమున కొకవిధమగు సంతాప మధికమైపోవుచున్నది.

ఉ. సూనుల నాలిఁ గూరిచినచుట్టముల న్విడనాడి విప్రవా
సానలదహ్యమానుఁడగునాతఁ డెయేదశ నొప్పునారిఁ గాం
దా నెవ నొంచుచుండునో సతంబుఁ గుమారులఁ, దత్స
దృశ్యు లెందేనియుఁ గన్నులం బడుదురేనిఁ గడుం
దురపిల్లు నార్తుఁడై.

(కౌఁగిలించికొని ఏడ్చును)

విదూ—(ఆతురతతో) (కుశలవులం బట్టుకొని) రామా! రామా! త్వరగా ఈమునికుమారులను వదలివేయుము, వదలివేయుము. ఆలసింపకుము.

రాము—(తొట్రుపాటుతో వదలి) కౌశికా! ఏమది?

విదూ—రఘుకులజుఁడు కానివాఁ డెవఁడేని యీసింహాసనముపైఁ గూర్చుండునెడల తత్క్షణమ యాతనిశిరము వ్రేయి

ప్రక్కలైపోవునని సాకేతనగర వృద్ధులవలన నేను విని యుంటిని.

రాము—(తత్తరపడుచు) అట్టులైన వీరిని త్వరగా డించి వేయుము.

(కుశలవులు సింహాసనము దిగి నేలపై కూర్చుండుదురు)

రాము—కుమారులారా! మీకు తొల్లింటివలెనే సేమమే గదా! మరేమియు నంగవైకల్యము లేదుగదా!

కుశలవ— రాజా! సేమముగానే యున్నాము. భయపడకుము.

విదూ—ఆశ్చర్య మాశ్చర్యము! రాఘవకులవృద్ధజ్ఞానమున్నను ఈమునికుమారులు దేహవికారమావంతయు లేక కుశలముగా నుండిరే!

రాము— ఇం దాశ్చర్య మేలనోయి! (కుమారులం జూపుచు) తపఃసంపన్నశరీరముల కాపద లెన్నండైన రాఁగల వామఱి?

గీ. అవని నప్రతిహతములౌ నాశుగములు
భిదురధారాప్రహారముల్ వృధయె సుమ్ము
అనుపమానతపఃకవచాయితమ్ము
లైన తాపసజనముల మేను లెడల.

(నవ్వుచు కుమారులతో)

మీ రిరువురు నొకరి నొకరు రాచుకొనుచు కూర్చుందురేల?

కుశలవ—పుట్టినప్పటినుండి ఇది మా అలవాటు.

రాము—అలాగా?

విదూ—రాఘవా! నీ కిరువురు నేఁడు మన కతిథులుగా వచ్చినారు. తగురీతి నాతిథ్య మొసంగుము.

రాము—కుమారులారా! మీవయోరూపలావణ్యాతిశయముచే నినుమడించిన యుత్సాహమున నడుగుచుంటిని. బాగుగా సమాధాన మీవేఁడెద.

కుశలవ—అలాగే. అడుగుఁడు, చెప్పెదము.

రాము—మీవర్ణము, మీఆశ్రమము ఏయ్యది?

కుశుఁడు—(లవునకు కనుసైగ చేసి చెప్పుమనును)

లవ—మాదా? రెండవది వర్ణము, మొదటిది ఆశ్రమము.

రాము—బ్రాహ్మణకుమారులు కారా? అటులైన మీనమస్కారము, న్యాసాసనపరిగ్రహణము అంతగా అపరాధము కా దన్నమాట. సరియే, క్షత్రియకులాధిపతులగు సూర్యచంద్రులలో మీవంశకర్త యెవరో యెఱుంగుదురా?

లవ—ఆ. ఎఱుంగుదుము. సహస్రకిరణుఁడు.

రాము—మాతో సమానకులీను లేనా?

విదూ—ఇరువురికి నొకటియేనా సమాధానము?

కుశలవ—ఆ. ఒకటియే.

రాము—మీఇరువురికి కేమైన సంబంధము గలదా?

లవ—సోదరులము. ఒకతల్లిబిడ్డలము.

రాము—కావుననే ఒకేపోలికతో నున్నారు. సమాన వయస్కులా?

లవ—కేవలపిల్లలము.

రాము—అలాగా. మీలో జ్యేష్ఠుఁ డెవరు? మీనామధేయము లేమి?

లవ—నాపేరు లవుఁడందురు. నా అగ్రజుని ..........

కుశ—నాపేరు కుశుఁడు.

రాము—బాగుగా నున్నది.

విదూ—నామములుమాత్రమే తెలిసినవి. జ్యేష్ఠుఁ డెవరో సమాధానము రాలేదే.

రాము—నా అగ్రజుఁ డనుటవలననే కుశుఁడు జ్యేష్ఠుఁ డని తెలియుట లేదా?

విదూ—అవు నవును. పొరబడితిని.

రాము—మీగురువుగారి పేరేమి?

లవ—వాల్మీకిమహర్షి.

రాము—ఆయన మీ కెట్లు గురువు?

లవ—ఉపనయన, ఉపదేశాదికములద్వారా.

రాము—మీజనకునిపవిత్రనామము వినిపింతురా?

లవ—ఏమో, ఆతఁ డెవరో, ఆతని పే రేమో మే మెఱుంగము. మాఆశ్రమములో నెవరును అతనినామ ముచ్చరింపరు.

రాము—నిజమా! మీ రెఱుంగరా?

కుశ—నేనుమాత్ర మొకవిధముగా నెఱుంగుదును.

రాము— ఏమని?

కుశ—కనికరము లేనివాఁడని.

రాము—(విదూషకునితో) కౌశికా! వింటివా? ఏమిపేరోయి యిది? కనికరము లేని వాఁడఁట!

విదూ—(ఆలోచించి) కనికరము లేనివాఁడని ఆతని నెవ రను చుందురు?

కుశ—మా అమ్మయే అనుచుండును.

విదూ—కోపమువచ్చినపు డిట్లనునా? లేక అది ఆమె అలవాటా?

కుశ—చిన్నతనముచే మే మెప్పుడైన కొంచె మల్లరిచేయుచున్న యెడల 'కనికరము లేనివానిపుత్రులగుటవలన మీకుగూడ నట్టిగట్టిపట్టే యలవడినది. చాలు మీదుండగములు' అని మమ్ము దండించుచుండును.

విదూ—(రామునితో) వయస్యా! వీరలతండ్రి పేరు కనికరము లేనివాఁడగు నెడల వీరితల్లి యాతనిచే నవమానింపఁబడి యడవులఁ బంపి వేయఁబడియుండును. అందువలననే యాపె యాసంతాపము నాపుకొనఁజాలక కుమారుల నట్లు దండించుచుండును.

రాము—బాగుగా నూహించితివోయి! (నిట్టూర్పు పుచ్చి,) (తనలో) అక్కటా! వైదేహి మత్కృతమగు నపరాధ ముచే తనతనయుల నిట్టిమన్యుగర్భములగు నక్షరములచే దండించుచున్నది కాఁబోలు. (కన్నీరు నాపుకొనుచు)

(లవునితో) ఆకౌశికేయుఁడే నాఁడు ప్రస్తుతముమీ యాశ్రమమున నున్నాఁడా ?

లవ—లేఁడు.

రాము—(తొట్రుపాటుతో) వానివిషయము నెప్పుడైనఁ విని యుంటివా ?

(లవుఁడు కుశునిముఖమును జూచును)

కుశ—ఆతనిపాదముల కంతకను కొకమారైనను మేము నమస్కరించియుండలేదు. కాని మాయమ్మ ఏకవేణిచే నాతని నిశ్శ్వసితములు మాత్రము సూచింపఁబడుచున్నవి.

రాము—పోసి! ఆతఁ డెన్నఁడైన మిమ్ము తనయంకమునఁ జేర్చియుండెనా ?

కుశ—అదియు లేదు.

రాము—(విదూషకునితో) వీరిప్రవాస మతిదారుణముగాఁ దోఁచుచున్నది. (కుశలవులతో) మీ రింతకు మీతలిదండ్రు లిరువు రొక్కచో నుండఁగా వారియెదుటఁ బడలేదన్నమాట. (విదూషకునితో జనాంతికముగా) కాశికా! ఈబాలుర తల్లిపేరేమో తెలిసికొన నాకత్యంతోత్సాహము వొడముచున్నది. స్త్రీప్రసంగము నాకయుక్తము గదా. అందు తపోవనమున స్మరింపనైనరాదు. ఇఁకఁ దెలిసికొనఁదగు నుపాయ మెద్ది ?

విదూ—(జనాంతికముగా) బ్రాహ్మణుల కడుగరాని దేమున్నది ? నేనే అడుగవలసియుండును. (ప్రకాశముగా) బాలురారా! మీతల్లిపేరేమి ?

లవ—ఆమెకు రెండు పేర్లు గలవు.

విదూ—ఏమని?

లవ—తపోవనవాసులు దేవి అనియు, వాల్మీకి వధూ అనియు పిలుచుచుండు టలవాటు.

రాము—(విదూషకునితో) ఏక్షత్రియకులము వాల్మీకిముఖ నిర్గతవధూశబ్దమునకు యోగ్యమగును?

విదూ—సామాన్యముగా క్షత్రియకులమనిమాత్ర మెఱుంగుదునుగాని అం దెయ్యదియో నాకు దెలియదు.

రాము—మిత్రమా! ఒకమాఱు దగ్గఱకు రమ్ము.

విదూ—(సమీపించి) ఏమియాజ్ఞ?

రాము—వీరిచరిత్రమంతయు చూడజూడ నాకు సరిపోవుచున్నదోయి.

విదూ—ఎట్లు?

రాము—చూడుము. సీతాగర్భధారణసమయమునకు కాలము సరిపోవుచున్నయది. వీరును క్షత్రియులు. అందు సూర్యకులసంభూతులు. తండ్రి నెఱుంగరట. రాజాసనారోహణమున నిశ్శంకులు. కనికరము లేదనుమాట తండ్రియందును వీరియందును గల దారుణత్వమును సూచించుచున్నది. దేవిశబ్దము వీరితల్లియొక్క అలౌకిక మాహాత్మ్యమును బోధించుచున్నది. వేయేల? వీరిచరిత్రము విన్నకొలంది నాకు సరిపోవుచు నాహృదయ మెంతయు వ్యాకుల మొందుచున్నది. (విషాదము నందును)

విదూ—వీరు సీతాతనయులని నీ అభిప్రాయమా?

రాము—కాదు కాదు. కాని చూడఁగా... ... ...విషయ
మంతయు నన్ను బోలియే యున్నదనుకొనుచున్నాను.
అయినను—

చ. మురిపెపుఁ బ్రాయమున్, భువనమోహనరూపము, రాచ
కవి, బంగరు నిరసించు మైమెఱుంగు, నాసల మునిస్త్ర,
కులంబు, నిన్నిటం బరఁగెడు వీరలం గనఁ గుమారుల,
ధీరులఁ గాంచ సిద్ధయా ధరణిజ బిడ్డలుం దలఁచి తత్తర
మందఁదోఁచెం జిత్తముత్.

(మిగుల విచారము నొందును)

(నేపథ్యములో)

ఎవరచ్చట? కుశలవులదగ్గఱ నెవరైన యుండిరా లేక ...

కుశలవ—స్వామీ! మేమిరువురము నిచటనే యున్నాము

(మఱల నేపథ్యములో)

ఇచట నింత కాలయాపనము చేయుచున్నారేల?

చ. అమలుఁడు వామలూరుభవుఁ డావటఁ గూరిచినట్టి దైవ
తోత్తముఁడు పురాణపూరుషుఁ డుదారుఁడు నైన రమేశు
సచ్చరిత్రము వినిపింపఁగావలె ధరాతనయాపతి కిప్పు గాన
వేగమ నెఱవేర్చికోఁ జనుఁ డిఁకన్ మును లెల్లఱుఁ బ్రాహ్మ
కృత్యముల్.

కుశలవులు—రాజా! మాగురువుగారి దూత మమ్ము బిలచు
చున్నాఁడు. త్వరగాఁ బోయెదము సెలవొసంగుడు.

రాము — మునివర్యా! ఆజ్ఞ నాకును మాననీయమే అయినను—

మ. లలితాలాపము మీఱ మీఱలు కవల్ గానక్రియాదక్షులు,
ఉజ్జ్వలవాక్ తత్కృతిఁ గూర్చె నాదికవి, ద్రాక్షాసార
సుస్వాదుసూక్తిలితంబై ప్రథమావతీర్ణ మవనిం గావ్యంబు,
శార్ఙ్గి శ్రీమారాజలజాతాక్షయశోంకితంబు, వెలుఁగే శ్రావ్య
స్థితిం బొల్చు నాక్.

కౌశికా! ఈ యిరువురును సాక్షాత్సరస్వతీయవతారమే. కావున నీకృతివాక్కులను సుహృజ్జనములతో సహా వినవలయునని తలంచుచున్నాను. సభ కేర్పాటు చేయుచు త్వరగా నీవేగి సౌమిత్రిని నాయొద్ద కనుపుము. నేనును ఏతచ్చిరాసనఖేదమును పరిభ్రమణముచే దూరము చేసి కొనియెద.

(అందఱు నిష్క్రమింతురు.)



# కుందమాల

## షష్ఠాంకము

(కంచుకి ప్రవేశించును)

కంచుకి—సభ తయారయినది. రామచంద్రుఁడింకను రాకుండుటకు కారణ మేమి? కానిమ్ము, ఇంక కొంచెము సేపు నిరీక్షించి యుండెద. (ఆదరముతో) అడుగో రామచంద్రుఁడు మాటలోనే వచ్చినాఁడు.

గీ. కులమునకు నుద్దియగు శీల మలరఁ దనదు
నను జుఁడుం గుశలవులు త న్ననుసరింప
వచ్చుచున్నాఁడు శ్రీరామభద్రుఁ డడుగో
త్రినిగమయుతాశ్వమేథంబురీతి నిటకు.

(రాముఁడు, లక్ష్మణుఁడు, కుశలవులు ప్రవేశింతురు)

కంచుకి—(ఎదురుగాఁ బోయి) రాజా! విజయీభవ. అలంకృతమగు నాస్థానమంటపము, ఈసింహాసనము మీ రాకకై యెదురుచూచు చున్నయవి. దయచేయుఁడు.

(అందఱు కూర్చుందురు.)

కంచుకి—(రామునితో) ఈసభాసదు లెల్లరుఁ దమయభి వాదము లందికొన వేఁడుచున్నారు.

రాము—(గ్రహించుచు) (కంచుకితో) సమీపమున నీ తెర వైచినా రెవ్వారలకు ?

కంచు—కౌసల్యాదిదేవీత్రయమును, భరతాదులవనితాసమూహమును, ఈతెరమాటున నున్నారు.

లక్ష్మ—అగ్రజా! వైదేహిమాత్ర మీదేవీగణమందుగాని, వధూగణమందుగాని నేఁడు లెక్కింపఁబడుటలేదుగదా!

రాము—(నిట్టూర్పు పుచ్చి) కంచుకీ! నీవును నీస్థానమున కేఁగి కూర్చుండుము.

కంచుకి—చిత్తము. (పోయి కూర్చుండును.)

రాము—కుమారులారా! మీగానమును ప్రారంభింతురా ?

కుశలవులు—ప్రభునాజ్ఞ.

గీ. కూర్మి రాణులు గాఁగఁ గైకొనియె శుభచ
రిత్ర కౌసల్య, కైక, సుమిత్ర యనఁగఁ
బొలుచు సాధ్వీమతల్లుల ముపుర దశర
థుండు భుజబలజితధరామండలుండు.

రామలక్ష్మణులు—(సంతోషముతో) ఆహా! మనతండ్రియే యీకథానాయకుఁడుగా నున్నాఁడే. (ఇరువురు నమస్కరించి సింహాసనమునుండి దిగి నేలపైఁ గూర్చుండురు.)

కుశలవులు—గీ. జలధరశ్యాము రాముఁ గౌసల్య గాంచె

లక్ష్మ—(నమస్కరించును.)

కుశలవులు— నిరతరామసేవారతు భరతుఁ గైక
కనె సుమిత్రాసతీమణి కవల శౌర్య
ధనుల లక్ష్మణశత్రుఘ్ను లనెడువారి.

రాము—(లక్ష్మణుని కౌగిలించుకొనును.)

కుశలవులు—

క. ధరణీతనయను రాముం
డురుబలుఁ డగు లక్ష్మణుండు నూర్మిళఁ బెండ్లా
డిరి కుశకేతుతనూజల
భరతుఁడు శత్రుఘ్నుఁ డంత బ్రమద మెలర్పన్.

గీ. బాల్యయౌవనమధ్యమావయసు మెఱయఁ
గలభసుందరగమను లా నలువు రన్న
దమ్ము లనురూపరూపలౌ దమ వెలందు
లందుఁ గందర్పబాణవిద్ధాత్ము లయిరి.

లక్ష్మ—ఆహాహా! ఎంత మధురము!

రాము—వృథాకాలయాపన మేల? పాడుడు, పాడుడు.

గీ. నాన్న మూకాళ్ళముసలివై నలువురమును
నేము నెమ్మియీకలు ధరియించి యాడు
కొనెడునాఁడు సాకేతనిష్కుటమహీరు
హములు జానుప్రమాణమాత్రములె తలఁప.

కుశలవులు—

గీ. రామరాజ్యాభిషేకమహామహోత్స
వమున మునిఁగి తేలుచునుండఁ బట్టణంబు

భరతుఁడుం దనమాతులుపురికి నరిగి
యున్నయదనునఁ గైక దురూహ సేసి.

రాము —(తనలో) మారెండవతల్లియే నిందింపఁబడుచున్నదే.
(ప్రకాశముగా) బాలురారా! ఈకథ చాలించి సీతాప
హరణమునుండి పాడుఁడు. వినెదము.

కుశలవులు —

గీ. పసఁబసిఁ గలుషచిత్త శూర్పణఖవలన
జానకీరూపవిభవంబుఁ దా నెఱింగి
యపహరించె శీలముఁదక్క నాపెమేను
రావణుండు ప్రపంచవిరావణుండు.

లక్ష్మ —(రాముని ముఖముఁ జూచును)

కుశలవులు —

కం. దశయోజనవిస్తృతమై
న శరధి బంధించి పోరుసన్ రావణు ఘో
రశరములఁ దునిమి క్రమ్మఱ
దశరథసుతుఁ డేఁగుదెంచెఁ దమిమైఁ బురికిన్.

సీ. అటుపైని శ్రీరాముఁ డపవాదభీతిమై
ననుజునిం జీరి యీయవనిసుతను
మునిసతీజనసమీక్షణాకైతవంబున
నటవిలో డించి రమ్మని వచింప

శరభశార్దూలకేసరివరాహాముఖము
జంతుసంతానసంచారినయి
నైన బాహ్నపితరి మంటియున్నట్టి వెద
దట్టపుటడవిలో నట్టనడుమ

గీ. నిండుచూలాలు నిర్దుష్ట నిర్మలస్వ
భావపూత జగన్మాత భ్రాతృపత్ని
నాంటి విడనాడి, లక్ష్మణుండు విడిచి వచ్చె
యోఁగె మఱలి పేటి కెదయుహృదయుఁ డగుచు.

లక్ష్మ — అబ్బా! ఈలక్ష్మణుఁ డెంత క్రూరుఁడు?

రాము — ఇందు లక్ష్మణునిదోష మేమి? కేవలము రాముని యాజ్ఞగదా యది! తరువాత......

కుశలవ — ఈగీతము పూర్తియైనది. సెలవైన నింకొక్కటి పాడెదము.

రాము — అట్లే కానిండు. (లక్ష్మణునితో) (ఉద్వేగముతో) సౌమిత్రీ! ఎంతకష్టముఁ సంభవించినదోయి సీతకు!

కుశలవులు —

గీ. అచట నాగర్భగుర్విణి యాత్మజీవి
తేశు మఱలఁ గన్గొనుభాగ్య మింకమీఁద
నబ్బఁబోవ దటంచు నైరాశ్యమంది
యసువులం బాయ సమకట్టె నతిరయంబ.

కుశ — (మెల్లగా లవునితో) తమ్ముఁడా! సీతావృత్తాంతశ్రవణముచే వీ రెంతయో సంతాపము నొందుచున్నట్లున్నారు,

గమనించితివా? (లక్ష్మణునితో) మీరు మా రామాయణ
కథానాయకులగు రామలక్ష్మణులు కాఁగదా?

లక్ష్మ—ఆ. ఆమహనీయులమే.

కుశ—సీత నడవిలో దింపివచ్చిన లక్ష్మణుఁడవు నీవేనా?

లక్ష్మ—(సిగ్గుతో తలవంచి) నోటిమీఁదుగా చెప్పవలయునా?

కుశ—సీత రామునిధర్మపత్నియా?

లక్ష్మ—అవును.

కుశ—తరువాత సీతావృత్తాంతముగాని, ఆమెగర్భవిషయము
గాని మీకేమైనఁ దెలిసినదా?

లక్ష్మ—మీగానముద్వారా కొంతవఱకు దెలిసినది.

రాము—(సంభ్రమముతో) తరువాత సీత యేమయినదో
కదా! (బాలురతో) కుమారులారా! మీరు నేర్చిన కథ
యింతవఱకేనా?

కుశలవులు—అవును. మాగురువుగా రింతవఱకే నేర్పినారు.

రాము—లక్ష్మణా! కణ్వమహర్షిని బిలువనంపుము.

(లక్ష్మణుఁడు పోయి కణ్వునితోఁ బ్రవేశించును.)

కణ్వ—(దూరముననే చూచి) అహా! ఏమి నాభాగ్యము?

గీ. రహిని నీలాభ్రరుచిరుఁడై రామవిభుఁడు
ధరణిజాగర్భశుక్తిముక్తాఫలద్వ
యముతో పోలుచుచున్నాఁడు ముత్యములనడుమ
నలరు నయ్యింద్రనీలమ్ము చెలువు దోఁప.

(సమీపించి) రామచంద్రా! మునీశ్వ మహర్షిగారు

రాము—(నమస్కరించి) స్వామీ! ఈయాసన మలంకరింపుడు.

కణ్వ—(కూర్చుండి) నన్ను బిలువనంపిన కారణ మేమి?

రాము—స్వామీ! రామాయణ శ్రవణము చేయవలయునను కుతూహలమున బిలువనంపితిని. అనుగ్రహింపుఁడు.

కణ్వ—అలాగా! ఎంత భాగ్యమాయె! అట్లే వినిపించెద. కుశలవు లెంతవఱకు గానముచేసియున్నారు?

లక్ష్మ—సీత నడవిలో విడిచి లక్ష్మణుఁడు మఱల అయోధ్యకు పోయెనఁట.

రాము—తరువాతివృత్తాంతము సెలవీయఁగ వేఁడెద.

కణ్వ—

గీ. అవనిజామృతిప్రయత్నంబు వల్మీక
భవుఁడు శిష్యగణమువలన నెఱిఁగి
యరిగి యాఱడించి స్వాశ్రమంబున కావెఁ
దోడి తెచ్చెఁ గూర్మి దోఁప నెంతొ.

రాము—ఆహా! ఏమి యీరఘుకులముపై గల అవ్యాజ దాక్షిణ్యము! నమసిపోనున్న కులమంతయు నీవాల్మీకి ఋషిసత్తమునిచే నుద్ధరింపఁబడినది. నాజన్మ సార్థక మైనది.

కుశలవ—అదృష్టవశమున సీతయు సేమమే.

(అందఱు సంతసింతురు.)

కుశ—తమ్ముఁడా! మనతాతగారి ఆశ్రమములోనే యున్న యంట సీత. ఆమె యెవరు! మన మెఱుఁగమే!

లవ—నాకు కాదు. ఈగీతములో నట్లు సీత యని కవి వ్రాసి నాఁడుగాని ఆశ్రమములో మాక మెఱుఁగనివా రెవరు?

రాము—తరువాత—

కణ్వ—

కం. వనితాజనమదనాయిత
లినకులరుచిరాంగు లనఘు లిద్ధచరిత్రుల్
ఘనుఁ డాసుతులా గొమరులఁ గవ
లను నొకశుభకాలమం దిలాతనయ కనెన్.

లక్ష్మ—రాఘవకుల మవిచ్ఛిన్నమై యతిశయించుఁగాక.

కుశలవ—పుత్రోదయసంపన్నుఁడగు రామునకు జయమగుఁ గాక.

రాము—సీతకుమారులు వీరే యైయుందురా?

కుశలవ—(ఒకరి నొకరు చూచుకొనుచుందురు.)

రాము—(కణ్వునితో) తరువాత—

కణ్వ—

గీ. తనకు నెచ్చెలి దశరథధరణిధవుని
మనుమ డాట జాతాదికర్మములు ప్రీతి
నాచరించి పేళ్లిడియె సంయమివరుండు
లలిఁ గవలవారలకుఁ గుశలవు లటంచు.

రాము.—ఇఁక సందియమేల? నా ప్రియపుత్రులు వీరే. (తొందరగా సింహాసనమునుండి లేచి) హా! కుమారా! కుశ! లవా! (కుమారులఁ గౌఁగిలించుకొని పునఃపునము మూర్ఛిల్లుదురు)

కణ్వ.—ఎంతకష్ట మెంతకష్టము?

గీ. ధరణిజాత్మేశువృత్తాంత మెఱుకపఱిచి
రఘుకులోపకృతిం బొనర్పంగఁ బోయి
రాఘవుల శూరులన్ నల్వురన్ క్షణాన
మూర్ఛిలం జలిపితి మందబుద్ధి నయితి.

(పరిశీలించి చూచి) కొంచెము శ్వాస వచ్చుచున్నటులున్నది. ఇవంతయు త్వరగాఁ బోయి వాల్మీకిమహర్షి కెఱింగించెద. (నిష్క్రమించును.)

(వాల్మీకి, తత్తరపడుచు సీత ప్రవేశింతురు)

వాల్మీ—సీతా! సీతా! ఆలసింపకుము. వారల కుపచారములు సేయవలయును. త్వరగా నడువుము. ఆలసించిన మూర్ఛవలన అపాయము రాఁగలదుసుమా!

సీత—(శోకముతో) స్వామీ! రాఘవులు సజీవులై యుందురు గదా?

వాల్మీ—వారి కేమియు భయము లేదు, దుఃఖింపకుము. (సమీపించి) చూచితివా శ్వాసలు!

సీత—మీయనుగ్రహముచే ధన్య నయితిని.

వాల్మీ—

గీ. పడంతి! ధైర్యవృత్తిమనంబు పదిలపఱిచి
కూర్మిపూడ్కుల నిటు కనుంగొనుము, విమల
భవదఖండకథాలయవాతగలిధ
రాతలాపాతితంబు నీ రఘుకులంబు.

సీత—(తల వంచి) ఆర్యపుత్రుఁడు నాకు దర్శనమునకై యాజ్ఞ నీయలేదుగదా? ఇపుడు నే నిచట నున్నచో—

వాల్మీ—(సగర్వముగా) నే నుండఁగా నాజ్ఞాపించుటకుఁ గాని అడ్డగించుటకుఁ గాని తలపెట్టువాఁ డెవఁడు? పొమ్ము. నేనే యాజ్ఞాపించుచున్నాను. పొమ్ము. వారల కుపచారములు సేయుము.

సీత—(సమీపించి) హా దైవమా! ఏమిది? వీరి కింకను చైతన్య మొసంగవా?

(నేలపైఁ బడి ఏడ్చును)

వాల్మీ—సీతా! సీతా! శోకింపకుము. ఊఱడిల్లుము. నేను రామలక్ష్మణులను సచేతనులం గావించెద. నీవు నీకుమారుల మేల్కొలుపుము (రామలక్ష్మణులను సమీపించి చేతితో తట్టుచు) రామా! రామా! లక్ష్మణా! లెండు. లెండు.

సీత—కుమారా! కుశా! లవా! కండ్లు తెరువవా?

(కన్నీరు నింపుచు ముఖములపై నీరు చల్లును)

రాము—(చైతన్యము నొంది) కణ్వమునీంద్రా! వైదేహి కుశలమా?

వాల్మీ—కుశలవూ! నీయెదుట నున్న దెవరో చూడుము.

రాము—(చూచి) మహర్షిసత్తమా! మీ రెప్పు డరుదెంచితిరి? (సిగ్గొందును.)

వాల్మీ—సిగ్గిలెదవేల? ఇంకనైన సీత నంగీకరింపవా?

లక్ష్మ—(మూర్ఛ తెలిసి) అగ్రజుండు తెలివినొందెనో లేదో?

రాము—కఠినాత్ములు తెలివొందకుందురటోయి లక్ష్మణా!

కుశలవులు—(మూర్ఛ దేరి) తండ్రీ! తండ్రీ! రక్షింపుము.

(పాదములపైఁ బడి విలపింతురు.)

రామలక్ష్మణులు—(కౌఁగిలించుకొని) కుమారులారా! శోకింపకుడు, శోకింపకుడు.

వాల్మీ—(కుశలవులతో) తండ్రి కనుపడనంతవఱకు కలువరించి, కలువరించి, తుద కాతండు కన్పించిన నిట్లు విలపించుటయేనా మీరాచ మర్యాద? కన్నీరు తుడుచుకొని మీజనకునిం దనివితీర చూచికొనుడు.

కుశలవులు—(అట్లే చేయుదురు.)

సీత—(మెల్లగా) కుమారులారా! మీయెదుట నున్న యీవ్యక్తి యెవరో తెలిసికొంటిరా?

రాము—(లక్ష్మణునితో) ఏమి యీసీత ఉదాసీనత? చిరకాల సంప్రాప్తమగు నాసన్నిధానమును చూపుచేనైన గౌరవించుట లేదే.

వాల్మీ—(కోపముతో) రామా! నీవు, అతికరుణాపూర్ణ హృదయుఁడవును, మహాకులీనుఁడవును, కార్యాకార్య విచారవివేకవంతుఁడవునుగదా! ఇట్టినీకు జనకదత్తయు, దశరథుని పెద్దకోడలును, అరుంధతీకృతమంగళయు, వాల్మీకిచేఁ బోషింపఁబడినదియు, విమలచారిత్రయు, అనలునిచే పాతివ్రత్యమునకై సాక్ష్య మీఁబడినదియు, కుశలవుల కన్నతల్లియు, విశ్వంభరాతనూజాతయు, మహాసాధ్వియు, అబలయు, నగు సీతను కేవలమిథ్యాపవాదకారణమున నిరాకరించుట న్యాయమా ?

రాము—(విషాదము నందుచు తల వంచును)

వాల్మీ—లక్ష్మణా! పలుకవేల? తగునా యిది? అయిన నిందు నీదేమున్నది? చిన్నవాఁడవు. ఆజ్ఞాపాలనము నీ ధర్మము. (రామునితో) రావణుని జంపినపిదప సీతాపాతివ్రత్యమునకై సాక్ష్య మిచ్చినవా రెవరు ?

రాము—అగ్నిహోత్రుఁడు.

వాల్మీ—అట్టి అగ్నిహోత్రునిపై నిపు డానమ్మిక కుదు పోవుటకు కారణ మేమి ?

సీత—(జనాంతికముగా) అక్కా—టా! నామూలమునఁగదా నానాథుఁ డింత అధిక్షేపింపఁబడుచున్నాఁడు.

(చెవులు మూసికొనును.)

వాల్మీ —

చ. అరయఁగ మున్ జగత్త్రయభయంకరసంగరమం దరిక్షయంకరశరవారవహ్ని దశకంఠశిరోటవి నేర్చి పేర్చి,

యూధరణిజభావశుద్ధికి యిత్తఱి సలుపని సాక్షి గాఁగ,నీ
సరణిఁ గలఁగ నేల యశశ్చంద్రవాసిల కాన్న సిద్ధికి.

రాము—(అభిషేకమును చాలింపుమని సూచించుచు వాల్మీకి చేయి బట్టుకొనును.)

వాల్మీ—బలయుతమగు నీహస్తముతో నన్నెట్లు వారించెదవు?

గీ. అనుకృతిసరళమహా గ్రామ్యజనులకుఁ గా
సనులఁ బ్రేమ శాశ్వత, మది తాన్మహత్తు లేక
సమయు నలంతికారణమున నిముసమున
పులినతలమున నిలువఁగాఁ గలనె యిలను?

రామా! ఏల నా కిట్లు సన్న లొనర్తువు? నరులవుల నను గ్రహింపుము. ఆశ్రమమునకుఁ బోదము రమ్ము.

(అని ముందునకు సాగును.)

రామలక్ష్మణులు—మహానుగ్రహము. సంతుష్టుఁడము.

వాల్మీ—(వెనుకకు దిరిగి) జానకీ! చూచితివా, తపోధనులనుగూడ ఆజ్ఞాపించుచున్నాఁడు. ఈతనిమనసు పరిశీలింపుము.

సీత—నేనేమి పరిశీలింపఁగలను?

వాల్మీ—పరిశీలించిన కల్మషరహితవు కాఁగలవు.

సీత—(సిగ్గుతో) విదేహరాజతనయ అభిన్నచరిత్రయని జనమధ్యగతనై యథార్థమును వచించుచున్నాను.

వాల్మీ—నాశీలవికారమున కనురూపమగు ప్రతీకారము....
అని బిగ్గరగా ననుము.

సీత—చిత్తము. (దోసి లొగ్గి నలువైపులం జూచుచు) ఇంద్రాది లోకపాలురారా! గగనమధ్యంగతులగు సమస్త దేవతలారా! గంధర్వసిద్ధవిద్యాధరులారా! ప్రభావప్రత్యక్షీకృతసర్వలోకరహస్యులగు విశ్వామిత్రవసిష్ఠవామదేవాది మహాబుషీశ్వరులారా! సకలలోకశుభాశుభకర్మసాక్షియు, రఘుకులపితామహుఁడవును అగు నోసహస్రకిరణా! మీ రెల్లరు ఈసీతవాక్కులను సావధానులరై ఆలకింపుడు.

వాల్మీ—(అందఱితో) చూచితిరా! మహాప్రభావాకృష్టమై సీతామాహాత్మ్యముచే సంభవించిన యాశ్చర్య దృశ్యమును?

అందఱు—(ఆశ్చర్యముతో) ఆశ్చర్య మత్యాశ్చర్యము. ఈసీతా సాధ్వీసత్యవచనశ్రవణాదరమున సావధానత నొందెనో యన నిశ్శబ్దమై నిష్కృత్యమై స్థావరజంగమాత్మకమగు నీప్రపంచ మంతయు నొక్కమాఱుగ స్తబ్ధమైపోయినది. మఱియు—

మ. స్తిమితోత్తుంగతరంగభంగిని బ్రశాంతిం బొందెవారాశిబృందము, నిస్పందిత నీసదాగతియు సంస్తంభించె, నాదిత్య
శీతమయూఖుల్ గమనంబు మాని, రభయూధం బెల్ల
నిక్కించె శ్రోత్రములన్, లోకము సావధాన మయె,
సీతావాక్కు లాలింపఁగన్.

సీత—సకలలోకమహార్థప్రత్యయాపూరిత గురుశాసనుండును, ఉన్మూలిత మహామహీధ్రేంద్ర సహస్రనిరచిత సేతుబంధ విభక్తమహాసముద్రుండును, సురాసురభువనైకధనుర్ధరుండును, రఘుకులనందనుండును, అగు దశరథజ్యేష్ఠసుతుని వినా నాకీ పతివ్రతాధర్మవిరుద్ధభావమున నితరపురుషుండు నానయనములచే నీక్షితుండయికాని, వాగుపలాలితుండయికాని, మనసా స్మరింపఁబడికాని, నాహృదయగతుండైనయెడల ఈసత్యవచనముచే సకలలోకప్రత్యక్షదృశ్యమానదివ్యరూపధారిణియయి ధారుణీదేవి నాచిత్తశుద్ధి నీప్రపంచమున కంతకును వెల్లడిచేయుఁగాక.

(అందఱు నిర్భ్రాంతు లగుదురు.)

వాల్మీ—ఏమిది! రసాతలమునుండి అపూర్వమును, దారుణమును అగు నీ ధ్వని వెలువడి ప్రపంచమునంతయు తాఱుమాఱు గావించుచున్నది.

మ. త్వరితోద్వృత్తి రసాతలాగతమహాధ్వానం బాకండభ్రముం
బరిపాటింపఁ దొడంగెఁ, బల్లటిలి దిగ్భాగంబు లూటాడె,
సాగరనీరం బతివేలమై తటకనత్కాంతారముల్ దాఁకి చె
చ్చెరఁ గూల్పం గమకించుచున్నయని వీచీకోటు
లుప్పొంగఁగన్.

పితా! నీవచనములవలన ప్రపంచవిక్షోభ మసంక్షేప
ముగ సంభవించినది. కావున నీసత్యప్రభావమున
మఱల శాంతింపఁజేయుము.

సీత—కుశలవులతండ్రి అన్యవనితా పరాఙ్ముఖుండేని స్వప్న
మందైనను బాయక నే నాతనిచరణారవిందద్వయమును
గొలుచుటయేగాక యితర మెఱుఁగనేని ఈ ప్రపంచ
క్షోభ ముపశమించుగాక.

(నేపథ్యమున)

జగత్కల్యాణ మగుఁగాక. రాఘవకులమునకు మంగళ
మగుఁగాక.

మ. క్షితిజావాగ్గతసత్యవైభవసమాకృష్టాత్మ, రత్నాకరో
న్నతకాంచీరశనాభిరామ పరిపూర్ణస్వాంత, విశ్వంభరా
సతి దివ్యాకృతి మర్త్యలోకమున కుచ్చైఃస్ఫూర్తిఁ బాతా
ళనిర్గతయై వచ్చుచునున్నయద్ది యదె సంరంభంబునన్
గంటిరే?

(అందఱు విని విస్మయము నందుదురు.)

వాల్మీ—ఏమి యీవిపరీతము? అదృష్టపూర్వమును, అభూత
పూర్వమును, అశ్రుతపూర్వమును, అగు నాశ్చర్యవిష
యము నాకనుల కగపడుచున్నది. ఇది ఏమైయుండును?

మ. బలిసద్మోద్గతమైన యీవెలుఁగు విశ్వంబెల్ల వ్యాపించె,
శీతలనీరజరజస్సుగంధి మృదువాతంబుల్ దెసల్ గ్రమ్మె

సాంజలినై యొసఁగిన దాయుచున్నయది యాత్మకాంత,
సౌమిత్రి! యిమ్ములఁ గై వార మొనర్పుమా. ఇదుఁ డీఁకన్
బుష్పాంజలుల్ మీా రొసఁగుఁడు.

(అందఱు కుసుమాంజలి నర్పింతురు)

(పాతాళమును బ్రద్దలు చేసికొని భూదేవి ప్రవేశించును. అనేకమంది స్త్రీ లాకేయాకారముతో నామెపై పూవులు చల్లుదురు.)

అందఱు—(దోసి లొగ్గి)

గీ. అన్నపానాదు లొసఁగి నీ వఖిలభువన
ములను బ్రోచుచు, ఫణిఫణాస్థలి వసించి
పొలుపుమీఱుదు, వంబ! నీవలనఁగాదె
మున్ను వడసి రభీష్టార్థములను సురలు.

దేవి! నీ కిదె నమస్కారము. (నమస్కరింతురు.)

వాల్మీకి—

చ. సరసిజనేత్ర! వింధ్యకేతుపారమహీధరరాజముల్ పయో
ధరములునీకు, హారసముదాయము వ్యోమసరిద్వరంబు, సా
గరములు మేఖలారశన, కాయము విశ్వము, రత్నగర్భ! నీ
చరణసరోరుహద్వయి నచంచలభక్తి నుతింతు మెప్పుడున్.

భూదేవి—(దిక్కులం జూచి) అప్రతిహతవచనలగు పతివ్రతా శిరోమణులశాసన మనుల్లంఘ్యముగదా? కావున ఆమె తోడనే భాషించెద. కుమారీ! ఏమి నీయాజ్ఞ? ఏవ్యక్తి నీయాజ్ఞాపాలన మొనరింపవలయును?

సీత—(విస్మయముతో జూచుచు) దేవీ! నీ వెవరు?

భూదేవి—నీవు న న్నెఱుఁగవా ?

సీ. గొబ్బున రోదసీకుహర మప్రతిహత
గతితోడ వ్యాపింపఁగలుగునట్టి
తరణికిరణవార మరుగనేర దాకప్పు
డేని నెచ్చోటు, నాకింత యేనిఁ
బవమానజవుఁడయ్యుఁ బతగేంద్రుఁ డేలోక
మున కేగఁ బస దక్కి మూర్ఛనొందు,
వరతపోనిరతులౌ పరమయోగులకు న
గమ్య మేపుణ్యలోకంబు, హరికి

గీ. దాన మొనరించి సర్వంబు దానవేంద్రుఁ
డరిగె నేధామవరమున కవోటునుండి
నిర్గత నయితి నాగి ధరణీతనూజ
పలుకు లీడ్వఁగ మీనముఁ బడిశమట్లు.

అంతియగాక కుమారీ! మఱియొక టాలింపుము.

గీ. ప్రణవసహచరి యంద్రు నన్ పరమమునులు
భువనసముదయస్థితినాశములకు నేన
కారణం బౌదుఁ బరిణతిం గాంచుఁ దపము
లన్ని నాయంద, అవని నా నామాఖ్య, యబల!

మఱియు, బిడ్డా!

గీ. నాఁడు కైటభాసురపరిపీడితనయి
యాదివారాహరూపుఁడౌ నబ్జనయను

చేత, నీనాఁడు త్వత్ప్రభావాతిశయము
నను సముద్ధృతనైతిఁ బావని! ఇలాగ.

సీత—(అంజలి మోడ్చి) దేవీ! కరుణార్ద్రచిత్తవై నాచారిత్రము సర్వథా అవికలమని యావత్ప్రపంచమునకు ప్రకటించి నన్ననుగ్రహింపుము.

భూదేవి—అలాగే కావించెద. (నలువైపులఁ జూచుచు)

చ. వరసుగుణాభిరాము నినవంశపయోనిధిపూర్ణసోము, ని
ర్జరనుతపూతనాము, రఘురామునిఁ జక్క మఱొక్క మాని
సిన్ ధరణిజ స్వప్నమందునయినం గుమతిం దలపోసి
నమ్మఁగా దొరకొనునేని శీతకరతోయజబాంధవు లుర్విఁ
గూలరే?

(ఆకాశమునుండి పుష్పవృష్టి గురియును.
దేవదుందుభులు మ్రోయును.)

అందఱు—(సంతోషముతో) ఆశ్చర్య మత్యాశ్చర్యము. పృథివీనిరూపితమగు సీతామనఃశుద్ధి నెన్నెన్ని వింతలు సంభవించుచున్నవి?

చ. మొరసె నభోవిటంకమున ఘోరున నిర్జరబృందదుందుభుల్,
కురిసెఁ బరాగసౌరభము గుప్పున రేఁగఁ బలంకులన్ నిరం
తరనవపారిజాతసుమధార లవారిగఁ, జెల్వమీరె మి
న్నరయ ధరాత్మజోపరిసమారచితోరువితానమో యనన్.

(నేపథ్యమున)

గీ. సత్యసంధుఁడు దశరథ తన్మాతపుండు,
ఘనుఁడు జగదేకధన్వి రాఘవుఁడు, త్రిదశ
వర్గకీర్తియమాన మిక్ష్వాకుకులము,
పూతచారిత్ర జగదేకమాత సీత.

భూదేవి—(అంకజను జూచి)ఇప్పటికైన నీవైదేహి పరిశుద్ధయే
యగునా ?

అంకజు—(దోసి లొగ్గి)

గీ. సహజనిర్మల సీత మృషాప్రవాద
వారిదావృతమై సాక్షి, పడఁతి! నీకృ
పమెయి నీప్రోద్దు క్రమ్మఱ వన్నెఁ గాంచఁ
గలిగెఁ జంద్రికవలె శరత్కాలకలన.

(నమస్కరింతురు) ఆహా! ఈపవిత్రదంపతులు మఱల
నత్యాశ్చర్యముగాఁ గలియుచున్నారు.

వాల్మీ—కౌసల్యాత్మజా! ఇఁక సీత పరమపవిత్రచరిత్రయని
యనుగ్రహించి యామెను స్వీకరింపుము.

రాము—మునీంద్రులయాజ్ఞ. లక్ష్మణా! పాదాభివందన
మొనరింపుము (రామలక్ష్మణు లిరువురు వాల్మీకికి నమస్క
రింతురు)

సీత—(అంజలి మోడ్చి) (సంతోషముతో) ఆర్యపుత్రా!
జయ మగుఁగాక.

వాల్మీ—(జనాంతికముగా) ఈతని పరిగ్రహవిధానము సముచిత ముదాత్తతాసహితమే.

లక్ష్మ—(సంతోషముతో, సిగ్గుతో) దేవీ! పరమపావనియు, వధ్యురాలను అగు నీల క్ష్మణుని ప్రణామ మంగీకరింపుము.

సీత—లక్ష్మణా! ఇట్లు నిందించుకొనెదవేల? గురుశాసన పరిపాలకుఁడవై యిట్లే చిరకాలము సుఖంబుండుము.

వాల్మీ—రామా! లక్ష్మణుని వేడికోలంతయు పూర్తయైనది. ఇక నీయంతట నీవే ఆమెను మార్జించి ఆమెహస్త మును నీహస్తమునం బట్టుకొని యజ్ఞపీఠం బూన త్వర పడుము.

రాము—(సిగ్గిలును)

వాల్మీ—సిగ్గేలనోయి? ఈమెను గూడి నీవు యజ్ఞమొనర్పఁ బూనకున్న రాముఁడు మనసార సీతను గ్రహించె ననుటకు సాక్ష్య మేముండును?

రాము—గురుశాసన మనుల్లంఘనీయము.

(సీతచేయిఁ బట్టుకొని) జానకీ!

కం. పరిణయమునకున్ సుతు ల
ధ్వరమును నీరెండు బుధులు ఫలముగ వాకొం
దు రొకటి లభించె మన కిఁకఁ
దిరముగ సాయం బగుము ద్వితీయంబునకున్.

సీత—ఆర్యపుత్రా! సుధామధురములగు మీపలుకులు నేఁటికి వినఁగలభాగ్యము గలిగినందున సమసిపో సిద్ధము లయిన నాప్రాణములు మఱల బలవంతము లగుచున్నవి.

భూదేవి—గీ. సవనవిధు లవార్యంబులై జరుగుఁగాత,
కరుణ నింద్రుఁ డొసఁగుత సకాలవృష్టిఁ
బ్రజల కెవ్వేళ సేమముల్ వఱలుఁగాత
మైథిలీరాఘవసమాగమంబువలన.

(అంతర్ధానము నొందును)

రాము—పరమపావనియగు నీభూదేవి యంతర్ధాన మొందినది.

లక్ష్మ—అగ్రజా! దేవత లెప్పుడును మనకు సన్నిహితులే గదా!

రాము—లక్ష్మణా! సర్వలక్షణ లక్షితుండవగు నిన్ను సామ్రాజ్యపట్టాభిషిక్తునిం జేయ నా కత్యంతోత్సాహము పొడముచున్నది.

లక్ష్మ—(దోసి లొగ్గి) అగ్రజా! నాపై మీ కవ్యాజమగు కరుణాకటాక్షము గలదేని యువరాజునకు సహాయకుండ నగున ట్లనుగ్రహింపుఁడు.

వాల్మీ—ఇక్ష్వాకుకులజులకు తగినట్లుంటివోయి.

రాము—(జనాంతికముగా) లక్ష్మణుని ప్రార్థన మనుల్లంఘనీయము. కాన నేను నట్లే యాదరించెద. లక్ష్మణా! అభిషేకసంభారముల నాయత్తపఱపింపుము.

లక్ష్మ—పరికరమంతయు సంసిద్ధముగనే యున్నది.

మ. అరయన్ వాసవుఁ డిందుగౌరమగు దివ్యచ్ఛత్రముం బట్టె
చామరముల్ చేఁగొనినిల్చి రిక్కెలఁకులన్ భాగీరథీచంద్రభాం
బు లిర్వురు వీరల్ జలపూర్ణహైమకలశంబుల్ గొంచునే తెచ్చిరు
ర్వర ధన్యాత్ములసంపదల్ సురనవ్రాతప్రియంకారముల్.

రాము—లక్ష్మణా! మన మిదప్పరము వేత్రహస్తులకై ద్వార
పాలురముగా నుందము.

లక్ష్మ—చిత్తమలాగే.

రాము—అయినఁ నీవేత్రముం దీసికొనుము. (వాల్మీకితో) మహాత్మా! ఇఁక మీమనుమనిం బిలిపించి పట్టభద్రునిం గావింపఁ బ్రార్థించుచున్నాఁడ.

వాల్మీ—(కలశమును చేతఁ బట్టుకొని వచ్చుచు) ఓసాకేత నగరనివాసులారా! నానాదేశాగతధరణీకాంతులారా! విభీషణసుగ్రీవహనుమదాదిమహారథికవరులారా! వినుడు

గీ. అనుపమానభుజాబలఘనుఁడు జనకు
కూఁతుగారాబుకొమరుఁడు కుశుఁడు నేఁడు
భూరిరాజ్యాభిషిక్తుఁడై పొలిచె, మీరు
పరఁగ సుఖియింపుఁడీవానిపాలనమున.

(కుశునిశిరముపై చేయి నిడి) కుమారా!

కం. బలభేదికిఁ ద్రిదివంబున
నలఁ బాతాళంబునందు నహినాథునకున్

ఇల ఘనుఁడౌ మాంధాతకుఁ
గలిగిన మంగళము నీకుఁ గలుగుత సతమున్.

(నేపథ్యమున కుశమహారాజునకు జై అను కేకలు)

రాము—లక్ష్మణుని కోరిక లన్నియు ఫలించినవి.

అందఱు—(సంతసింతురు.)

రాము—(కుశునితో) కుమారా! సార్వభౌమా! నీయను
మతి యైనచో లవుని యౌవరాజ్యమున నభిషేకించెద.

కుశ—మీయనుగ్రహము.

రాము—(కలశమును దెచ్చి)

గీ. వైరిభీకరు, స్మరసుకుమారు, శుభవి
చారు, లవకుమారుని, కుశసార్వభౌము
నానచొప్పున యౌవరాజ్యాభిషిక్తుఁ
గా నొనర్చెద ముద మొప్ప మానసమున.

(అభిషేకించును. అందఱు సంతసింతురు)

వాల్మీ—రామా! నీమనోరథము లన్నియు సఫలములయినవి
గదా! ఇఁకేమైన నభిలషిత మున్నచోఁ దెలుపుము. నా
యోపినంతవట్టు పొనరించెద.

రాము—(తలవంచి, భక్తితో, నమస్కరించుచు)

మ. శుభదంబౌ భవదీయదర్శనవిధిస్ఫూర్తిన్ ధరాపుత్రియున్
శుభచారిత్ర యనింద్య నా నలరె సూనుద్వంద్వమున్

గూర్మి నీ వభిషేకించితి రాజ్యపీఠమున ధన్యం బయ్యె నా
పుట్టు విం క భవత్పాదపయోరుహద్వయికి నేఁ గావింతు
సాష్టాంగముల్.

ఇంక నా కెట్టి యభిలషితమును లేదు. మీయవ్యాజకరుణా
కటాక్షము నాపై నున్నఁ జాలు.

లక్ష్మి—(కుశునిమస్తకముపై చేయి నుంచి)

హరుఁ డంభోరుహసూతి, శ్రీపతి, సహస్రాంశుండు,
సోముండు, సాగరముల్, గంధవహుండు, లోకములు,
లోకస్వామి, లామ్నాయముల్, వరమానీంద్రు లపార
వైభవతతుల్ ప్రాపింపఁ బాలింత్రుగాక రహిన్ నూతన
సార్వభౌముఁ గుశు, సౌఖ్యం బందుతన్ లోకముల్.

(అందఱు నిష్క్రమింతురు)

(జవనిక జారును.)

సమాప్తము.

---

Kalyani Press, Tenali—January 1943.